Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇహలో నింతటి నరు డుంటే...

పంపినవారు :
పి. రామకృష్ణారెడ్డి, గోపాలపురం

# చందమామ

## ఈ సంచికలో


| | | | |
|---|---|---|---|
| డప్పువాయించిన కప్ప (గే.క.) | 2 | బేతాళ కథ | ... 29 |
| నీతివర్తనుడు (జా. క.) | ... 5 | తల్లీ కూతుళ్ళు | ... 33 |
| మకరదేవత (సీరియల్) | ... 9 | లెక్కలురాని రాజు | ... 41 |
| కాంతికవి కనువిప్పు | ... 18 | భూగోళం | ... 48 |
| గర్భశత్రువు | ... 20 | ఇంద్రజాలం | ... 50 |


ఇవిగాక :

ఇంకా హాస్యకథలు, రంగులబొమ్మ కథ - ఫోటో శీర్షికల పోటీ, చిత్రకథ, వార్తలు - విశేషాలు మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

"చందమామ"లో పాఠకులు పంపే కథలూ, హాస్యాలూ బాగుంటే వేసుకుంటాము. "చందమామ"లో ప్రచురణార్థం పాఠకులు మంచి బొమ్మలనూ, కార్టూనులనూ, కార్టూను కథలనూకూడా పంపవచ్చు. రచనలూ, బొమ్మలూకూడా స్వతంత్రంగా రచించినవై ఉండాలి.

చందా వివరములు :

చందమామ (ఏ భాషలోనైనా)

విడి సంచిక 0 - 6 - 0 సంవత్సర చందా రు. 4 - 8 - 0




భారత దేశపు అన్ని ముఖ్య కేంద్రములలో
ఇప్పుడు ప్రదర్శింపబడుచున్నది!



# మల్టీకలర్

ఫొటో ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లోనూ,
ప్రోసెస్ బ్లాక్‌లు తయారుచేయటంలోనూ
సరికొత్త యంత్ర పరికరాలతో
విశేషమైన అనుభవం గల నిపుణులతో

**ఆర్టిస్టులతో, టెక్నిషియనులతో**
**30" × 40" కెమెరా సహాయంతో**

అత్యున్నత ప్రమాణాలను ఎల్లప్పుడూ
నిలబెట్టగల ఏకైక ఆంధ్ర సంస్థ
(1956 క్యాలెండర్లకు చక్కని నమూనాలకు,
ముద్రణనుగూర్చి అడగండి.)

## ప్రసాద్ ప్రోసెస్ లిమిటెడ్,
చందమామ బిల్డింగ్స్
వడపళని ,, మదరాసు - 26.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికనుంచీ "తల్లీకూతుళ్లు" అనే కొత్త సీరియల్ కథా, "ఒక రోజు రాజు" (అట్టచివరి బొమ్మ) కథా ప్రారంభిస్తున్నాము.

"చందమామ" పాఠకులు లోగడ చంద్ర సూర్యులను గురించీ, గ్రహాలను గురించీ తెలుసుకుని ఉన్నారు. ఈ సంచికనుంచీ భూగోళంతాలూకు వైజ్ఞానికవిషయాలు అనేకం తెలుసుకుంటారు.

"పురాతన జంతువులు" అనే శీర్షికలో ఈ సంచిక నుంచి సస్తన జంతువులను గురించి మీరు చదువుతారు. పురాతన జంతువులన్నిటిలోకీ ఇవి మనకు సన్నిహితమైనవి; ఎందుచేతనంటె మనంకూడా సస్తన జాతికి చెందినవాళ్లమే. జాతుల పరిణామంలో కలిగిన మార్పులు కూడా ఈ శీర్షికలో ముందుముందు తెలుసుకుంటాం.

జనవరి
1956



సంపుటి 18
సంచిక 1

# డప్పు వాయించిన కప్ప!

అనగనగా ఒక ఊళ్లో
ఉండే దొక పాము
దాని పొగరుబోతు తనం
ఇంతింతన లేము.

సరుకులతో పోయే ఒక
శకటాన్నది చూసింది
బండిని నిలబెట్టాలని
పాడు బుద్ధి తోచింది.

తానేదో ఘనకార్యం
చేస్తున్నా ననుకొని






బతిమాలిందొక కప్పను
బాజా వేయమని.

బతిమాలడమే తడవుగ
పనులన్నీ ఎత్తికట్టి
పాడు కప్ప పాము గొప్ప
చాటసాగె డప్పుకొట్టి.

డప్పు మోత కలిగించిన
ఉత్సాహం చొప్పున
పాము వెళ్ళి బండి కడ్డు
పడి నిల్చెను చప్పున.

బండి చక్రములు రెండూ
పాము మీద నడిచె





మూడు ముక్కలైపోయి
పాడు పాము మడిసె.

పాము చచ్చిపోయిన సం
గతి కప్పకు తెలియక
ఒకటే గజిబిజి మోతగ
సాగించెను బెకబెక.

ఎగిరి వచ్చి పక్షులపుడు
తినివేసెను నాగును
అప్పటికీ కప్ప డప్పు
మోత విడువదాయెను.

"పాముపీడ వదలిన త
ర్వాతకూడ దాని గొప్ప



(గేయకథ)

ఎందుకు బాజా వెయ్యా
లీ మతిమాలిన కప్ప ?"

అని తలంచి పక్షులు బతి
కుండగనే కప్పను
పొడుచుకు తినివేయసాగె
నేముందిక చెప్పను !

పీడించేవారి గొడవ
వీడిన తరువాత,
తుడిచిపెట్ట పలిసిందే
చెడుపుచేయు మోత !



## అట్టమీది బొమ్మ

పూర్వం ఒకప్పుడు దేవతలకూ దానవులకూ గొప్ప యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దేవతలు పూర్తిగా ఓడిపోయినారు. దీనికి కారణం దేవతలకు సమర్థుడైన సేనానాయకుడు లేకపోవటమే.

దేవతలకు కలిగిన అపజయానికి విచారించి ఇంద్రుడు బ్రహ్మవద్దకు వెళ్ళి, "దేవా, దేవసేనకు తగిన నాయకుడు ఎక్కడ ఉన్నాడు?" అని అడిగాడు. బ్రహ్మ ఇంద్రుడితో, "సోమసూర్యాగ్ని సంభవుడైనవాడే దేవసేనను నడిపించి జయం చేకూర్చగలడు," అని చెప్పాడు.

ఈ సంగతి తెలుసుకుని ఇంద్రుడు సప్తఋషులవద్దకు వెళ్ళాడు. అప్పుడు వారు దేవతల విజయంకోరి ఒక గొప్ప యజ్ఞం ఆరంభించి, అద్భుతాగ్నిని ఆవాహనచేశారు. అద్భుతుడనే ఈ అగ్నికి సప్తఋషుల భార్యలను చూడగానే వారిపై కోరిక కలిగింది. ఈ సంగతి తెలిస్తే ఋషులు తనను శపిస్తారన్న విచారంతో కుంగిపోయి అగ్ని ఆత్మహత్య చేసుకోవటానికి యత్నించాడు.

ఇది గమనించి పార్వతీ పరమేశ్వరులు, యాగాన్ని కాపాడటానికి ఒక పన్నాగం చేశారు. ఈశ్వరుడు అగ్నిలో ప్రవేశించి అతని ప్రాణాలు కాపాడాడు. పార్వతీదేవి అగ్నియొక్క భార్య అయిన స్వాహాదేవిలో ప్రవేశించింది. అప్పుడు స్వాహాదేవి సప్తఋషుల భార్యల రూపులు ధరించి అగ్నిని ఆకర్షించింది. ఆమె వసిష్ఠుడి భార్య అయిన అరుంధతి రూపుమాత్రమే ధరించలేకపోయింది, మిగిలిన ఆరుగురి రూపాలూ ధరించింది.

ఈ విధంగా పార్వతీ పరమేశ్వరుల అంశలతో అద్భుతాగ్నికీ స్వాహాదేవికీ ఒక మహా శౌర్యసంపన్నుడైన కుమారుడు కలిగాడు. ఆ కుమారుణ్ణి కృత్తికలు గంగాతీరాన పెంచారు. అతనే కుమారస్వామి. కొద్దిరోజుల పిల్లవాడుగా వున్నప్పుడే అతను మదగజాలను సయితం అవలీలగా మచ్చిక చేశాడు, ఒక్కొక్క బాణంతో ఒక్కొక్క పర్వతశిఖరాన్ని ఛేదించాడు.

ఇంద్రుడు ఒకషష్ఠినాడు దేవసేనను ఒక కన్యారూపంలో తెచ్చి కుమారస్వామికి పెళ్లిచేశాడు. అందుచేతనే కుమారస్వామికి ఆ తిథి ప్రియమైనది.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించిన కాలంలో బోధిసత్వుడు ఆయన కుమారుడుగా జన్మించాడు. బ్రహ్మదత్తుడు తన కుమారుడికి శీలవుడని పేరు పెట్టుకున్నాడు.

కాలక్రమాన శీలవుడు కాశీరాజ్యానికి రాజు అయాడు. ఆయన ప్రజలను ఎంతో ప్రేమాదరణలతో పరిపాలించాడు. దారిద్ర్యంవల్లా, పొట్టగడపకా, అజ్ఞానంచేతా దొంగతనం మొదలైన నేరాలను చేసేవారిని ఆయన దండించటానికి బదులు దగ్గిరికి పిలిచి, అవసరమైతే డబ్బిచ్చి, హితభోధలు చేసి పంపేవాడు. ఇందువల్ల రాజ్యంలో నేరాలు తగ్గటమేగాక ప్రజలకు తమ రాజుపై అంతులేని అనురాగం ఉండేది.

కాశీరాజ్యానికి సమీపంలో ఉన్న కోసల దేశపు మంత్రికి, కాశీరాజ్యాన్ని సులువుగా గెలవవచ్చునని దుర్బుద్ధి పుట్టింది. ఆయన తన రాజుతో, "కాశీరాజైన శీలవుడు అతి దుర్బలుడు. ఆయన బందిపోటు దొంగలనూ, హంతకులనూ సయితం దండించటానికి వెనకాడతాడు. అటువంటి పిరికివాణ్ణి మనం సునాయాసంగా జయించవచ్చు," అన్నాడు.

ఇది నిజమో కాదో చూడటానికై కోసల రాజు తన సైనికులను కొందరిని పిలిచి, "మీరు సరిహద్దుదాటి కాశీరాజ్యంలో ప్రవేశించి, అక్కడ ఉండే గ్రామాలను కొల్లగొట్టి రండి!" అని ఆజ్ఞాపించాడు.

ఇలా వెళ్ళిన సైనికులు గ్రామాలమీద పడగానే అక్కడి ప్రజలు వారినందరినీ పట్టుకుని శీలవుడివద్దకు తీసుకుపోయారు.

"నాయనా, మీరు విదేశీయులల్లే ఉన్నారు. మా గ్రామాలను కొల్లగొట్టటానికి కారణమేమిటి?" అని శీలవుడడిగాడు.

"మహారాజా, మాకు తిండికి జరగక ఈపని చేశాం!" అన్నారు కోసల సైనికులు.



"మీ తిండికి కావలిసింది నన్ను అడగలేకపోయారా?" అంటూ శీలవుడు తన కోశంనుంచి కొంత డబ్బు తెప్పించి, వారికిచ్చి పంపివేశాడు.

శీలవుడి యీ ప్రవర్తనచూసి కోసల రాజుకు ఆశ అంకురించింది. అయినా అయన తొందరపడక, ఈసారి ఇంకా ఎక్కువ బలాలను కాశీరాజ్యపు నగరాల మీదికి పంపకం చేశాడు.

వాళ్లుకూడా సరిహద్దుగ్రామాలకు రాగానే, కాశీప్రజలకు దొరికిపోయారు. కాని శీలవుడు వీరినికూడా, పూర్వంలాగే, డబ్బిచ్చి పంపేశాడేగాని శిక్షించలేదు.



ఈసారి కోసలదేశపు రాజుకు ధైర్యం కలిగింది. అయన తన సైన్యాలను తరలించుకుని కాశీరాజ్యంపై యుద్ధానికి బయలుదేరాడు. ఈ వార్త గూఢచారుల ద్వారా తెలియగానే మంత్రులూ, సేనాపతులూ శీలవుడి దగ్గిరికి వచ్చి, "మహారాజా, కోసలరాజుకు మన శక్తి తెలియదల్లే ఉంది. మనపైకి యుద్ధానికి వస్తున్నాడు. యుద్ధయత్నాలకు అనుజ్ఞ ఇప్పించండి!" అని వేడుకున్నారు.

శీలవుడు యుద్ధానికి సమ్మతించలేదు. "అనవసర రక్తపాతం వద్దు. వాళ్ళకు కాశీరాజ్యం కావాలంటే తీసుకోనివ్వండి. వారికోసం కోట తలుపులు తెరిచి ఉంచండి!" అన్నాడాయన.

"మీరు శత్రువులుగా రానవసరంలేదు, మిత్రులుగానే రావచ్చు!" అని శీలవుడు కోసలరాజుకు వర్తమానం పంపాడు. ఈ వర్తమానంవిని, కోసలరాజు దీనిని శీలవుడి దౌర్బల్యంగా భావించాడు.

సద్వర్తన అనేది తెలియని కోసలరాజు తన బలగంతో కాశీరాజు దర్బారులో అడుగు పెడుతూనే, శీలవుణ్ణీ అయన మంత్రులనూ పెడరెక్కలు విరిచికట్టమని తన భటులకు అనతిచ్చాడు.





"అతిథు లిలా ప్రవర్తించటం అధర్మం," అన్నాడు శీలవుడు. ఆ మాట వింటూనే కోసలరాజు వికటంగా నవ్వాడు.

శీలవుడూ, అతని మంత్రులూ ధరించే లాంఛనాలు తీసివేశారు. కట్టుకోవటానికి వారికి సామాన్యమైన బట్టలిచ్చారు. సాయంకాలంలోగా నగరు విడిచి పోకపోతే ప్రాణాలు దక్కవని హెచ్చరించారు.

శీలవుడూ, అతని మంత్రులూ సాయంకాలంలోగా కాశీనగరం విడిచి అరణ్యమార్గంపట్టి పోసాగారు. బాగా చీకటిపడ్డాక ఆ అరణ్యంలోనే ఒక చోట పడుకున్నారు. వారికారాత్రి భోజనంకూడా లేదు.

అర్థరాత్రివేళ వారికి నిద్రాభంగమయింది. అనేకమంది దొంగలు కాగడాలు పట్టుకుని అక్కడికి వచ్చి చేరారు. వాళ్ళు శీలవుడితో ఈవిధంగా చెప్పారు:

"మహారాజా, మేము దొంగలం. తమ దయవల్ల మాకు ఇంతకాలమూ దొంగతనం చెయ్యకుండా జరిగిపోయింది. కాని నేటి నుండీ మాకష్టాలు అరంభమవుతున్నాయి. అందుచేత మేం ఈరాత్రి రాజసౌధం ప్రవేశించి ఈ సొత్తంతా దొంగతనంచేసి తెచ్చాం. ఇవిగో మీదుస్తులూ, లాంఛనాలూ, ఖడ్గాలూ! ఇది మీకోసం తెచ్చిన రాజ



భోజనం. మీరు భోజనంచేసి, మీ రాజ దుస్తులు ధరించి, తెచ్చిన ఈ సొత్తంతా ఏమిచెయ్యమంటారో సెలవియ్యండి!"

శీలవుడూ, అతని మంత్రులూ భోజనాలుచేసి తమతమ దుస్తులు ధరించారు. తరవాత శీలవుడు, "కొత్తరాజు మీ సమస్యను ఎట్లా పరిష్కరించేదీ తెలుసుకోవటం మంచిది. ముందుగానే దొంగతనం చెయ్యటం న్యాయంకాదు. ఈ సొమ్ము తీసుకువెళ్లి రాజుకిచ్చి మీకేమి బతుకు తెరువు చెబుతాడో అడగండి," అన్నాడు.

"అతిథ్యం ఇచ్చినవారిని, దోచినవాడికి న్యాయబుద్ధి ఉండదు, మహారాజా! మేమూ



నీచుడి దగ్గిరికి వెళ్లం. మీరే మాకెప్పటికీ మహారాజు. మీరే మాకు దారిచూపండి!" అన్నారు దొంగలు వినయంగా.

"మీరు వెళ్లకపోతే, ఈసొత్తు తీసుకుని నేనే వెళతాను," అన్నాడు శీలవుడు.

ఆయన వెంటనే తన మంత్రులతోసహా బయలుదేరి మర్నాడు ఉదయానికల్లా రాజసభ చేరుకున్నాడు. శీలవుణ్ణి చూడగానే శత్రురాజు నిర్ఘాంతపోయాడు. తరవాత, "నగరులో కనిపిస్తే ప్రాణాలు దక్కవని హెచ్చరించామే! మళ్ళీ ఎందుకు వచ్చారు?" అన్నాడాయన.

శీలవుడు జరిగినదంతా చెప్పి, "మహారాజా, నాకన్న ప్రజలను మరింత న్యాయంగా పరిపాలించాలనేకదా మీరు నన్ను వెళ్ళగొట్టి నాసింహాసనం ఆక్రమించుకున్నారు? అమాయకులైన దొంగలు ఈ సంగతి గుర్తించక తమ పరిపాలనలో జరుగుబాటుండదని భయపడి తమ ఖజానా దోచారు. వారి సమస్యలను నాకన్న మీరు మరింత బాగా పరిష్కరిస్తారని అభయం ఇచ్చి, మీసొత్తు మీకు పప్పగించవచ్చాను. నాకింతకంటె ఈరాజ్యంలో మరొకపని ఏమీలేదు!" అన్నాడు.

వెంటనే కోసలరాజుకు హృదయ పరివర్తన కలిగింది. ఆయన శీలవుడి కాళ్ళపై బడి, "మహాత్మా, దొంగలు సయితం ప్రేమించే మీమహిమా, సద్వర్తనా గ్రహించలేక, నీచుడైన మా మంత్రి సలహావిని, తమపట్ల తీరని ద్రోహం చేశాను. నన్ను అనుగ్రహించి మీరాజ్యం మీరేలుకోండి. మీ మైత్రిఉంటే చాలు, నాకు మీ రాజ్యం అవసరం లేదు!" అని వాపోయాడు.

శీలవుడు తిరిగీ కోసలరాజ్యాధిపత్యాన్ని స్వీకరించాడు. అతడు కోసలరాజునూ, అతని పరివారాన్నీ తనవద్ద కొన్ని రోజులుంచుకుని, అన్ని మర్యాదలూ చేసి, వాళ్ల రాజ్యానికి పంపివేశాడు.






## 7

[రాజు, సింహాసనం పరిత్యజించాలని ప్రజలు చేసిన ఆందోళన చిత్రసేనుణ్ణి కలతపరిచింది. ఆయన హఠాత్తుగా రాజప్రాసాద మంటపంమీంచి కిందకు దూకి ప్రాణత్యాగం చేశాడు. ప్రజలు సమరసేనుడికి జై జై నినాదాలు పలికారు. సమరసేనుడు, నరవాహనుణ్ణి వెంటపెట్టుకొని, సైనికులతో శత్రువుల మీదికి దాడి బయలు దేరాడు. తరవాత—]

"రెండు మూడు వందలమంది కాల్బల సైనికులకు ముందు, అర్ధచంద్రాకారంగా కొందరు అశ్వికులు కదలసాగారు. శత్రు అశ్వికులు హఠాత్తుగా కాల్బలసైనికుల మీదపడి చీకాకుపరచాలంటే, ముందు వారు సమరసేనుడి అశ్వసైనికులను ఎదుర్కొనవలసి వుంటుందిగదా?" అని అడిగాడు శివదత్తుడు.

"అవును, సమరసేనుడు తిరుగులేని యుద్ధవ్యూహం పన్నాడు," అన్నాడు మందరదేవుడు నవ్వుతూ.

"సమరసేనుడి ఈ కొత్త యుద్ధ తంత్రం శత్రువుల ఎత్తుగడలను తారుమారుచేసింది. క్రమక్రమంగా ముందుకు వస్తున్న సమరసేనుడి సేనావాహిని వాళ్ళకు బెదురు పుట్టించి వుంటుంది. వాళ్లు క్రమబద్ధంగా వెనకకు తగ్గసాగారు.

హఠాత్తుగా సమరసేనుడి సేనాముఖం నుంచి శంఖనాదాలూ, జయజయధ్వానాలు మార్మోగినై. అతివేగంగా ముందుకురికిన అతని అశ్వసైనికులను శత్రు అశ్వికులు ధైర్యంగా ఎదుర్కొన్నారు. ఈలోగా,



కత్తులూ ధరించిన ఆ అశ్వసైనికుల సంకుల సమరం వర్ణనాతీతం.

నాలుగైదు నిమిషాల్లో శత్రు అశ్వికులు చెల్లాచెదరై అన్ని వైపులకూ పరిగెత్తసాగారు. అదే క్షణంలో కాల్బలం శత్రువులపై కురికింది. విజయోత్సాహులైన సమరసేనుడి అశ్వికులుకూడా తమ యీటెలతో శత్రు కాల్బలంమీదికి లంఘించారు. పారిపోయేందుకు ఎటూ దారిలేని శత్రువులు ప్రాణాలకు తెగించి పోరాడసాగారు.

విజయలక్ష్మి సమరసేనుణ్ణి వరించనున్నదని నేను చాలా సంబరపడ్డాను. ఈ దెబ్బతో దేశంలో అరాజకం నశించి, ప్రశాంతత ఏర్పడగలదనికూడా నాకు నమ్మకం కలిగింది. అలాంటి శుభతరుణమే వచ్చిన నాడు, నరవాహనుడి కుటిల రాజనీతివల్ల కుండలినీద్వీపంలో ఎవరూ బాధపడవలసిన అవసరం కలగదు.

నేను ఈ విధంగా ఆలోచిస్తున్నంతలో, శత్రు సైనికులు హాహాకారాలుచేస్తూ, చెల్లాచెదరుగా పారిపోవటం కనిపించింది. పారిపోతున్న ఆ సైనికులను, సమరసేనుడి అశ్వికులు వెన్నంటి తమ యీటెలతో హతమారుస్తున్నారు. ఇక కాల్బల సైనికులు గాయపడిన తమ తోటి సైనికులకు కట్లు కట్టి సహాయపడు తున్నారు. మరికొందరు



ఆ దాపులనే వున్న చిన్న వాగులోదిగి దాహం తీర్చుకుంటున్నారు.

ఇక, నేను కోట బురుజు దిగి కిందకు వెళ్ళి, పట్టణ ద్వారాలు తెరిపించుదామను కున్నాను. విజయోత్సాహంతో మరలి రానున్న సమరసేనుడికీ, అతడి సైని కులకూ ఘనస్వాగతం ఇవ్వవలసిన బాధ్యత నామీద వుంది. కాని, నేను బురుజు మీంచి వెనుదిరిగేంతలో సైన్యంలో విజయఘోష లకు బదులు, హాహాకారాలు బయలుదేరినై.

నేను క్షణకాలం నివ్వెరపడి అక్కడే నిలుచుండి పోయాను. యుద్ధరంగంలో కొంచెం మిట్టగావున్న ఒక ప్రదేశం చుట్టూ సైనికులు పోగుకాసాగారు. ఏమిటా యీ విచిత్ర పరిణామం అని నేను అనుకునేం తలో పదిమంది అశ్వికులు హుటాహుటిని పట్టణ ద్వారాలకేసి తమ గుర్రాలను దౌడు తీయించ సాగారు.

నా మనసు చాలా కలవరపడింది. అను కోని విధంగా ఏదో దుష్టపరిణామం సంభ వించిందని నేను భయపడ్డాను. పట్టణ ద్వారాలకేసి వస్తున్న ఆ పదిమంది అశ్వి కులూ, తప్పక వార్తాహరులై వుంటారన్న నమ్మకం నాకు కలిగింది. నేను గబగబా బురుజునుంచి దిగి, నా గుర్రం ఎక్కి నా అనుచరులు వెంటరాగా, పట్టణ ద్వారం



దగ్గరకు వెళ్ళి, ద్వారాలు తెరిపించాను. ద్వారాలు తెరవటమే ఆలశ్యంగా పదిమంది అశ్వికులూ వేగంగా ద్వారాలు దాటి పట్టణంలో ప్రవేశిస్తూ, ఒక్కుమ్మడిగా, "నరవాహన మహారాజుకూ జై!" అంటూ అరిచారు.

ఏదో ద్రోహం జరిగిందని తక్షణం నేను గ్రహించాను. "ద్రోహులు, నరకండి, హతమార్చండి!" అంటూ నేను, నా గుర్రాన్ని ముందుకు ఉరికించి, కత్తితో ఇద్దరిని తుదముట్టించాను. నా అనుచరులుకూడా తమ గుర్రాలను ముందుకు ఉరికించి, మిగిలిన ఆ యెనిమిది మంది నరవాహన పక్ష అశ్వికులను ఎదిరించారు.



వీధులవెంట బారులుతీరి నిలబడ్డ సైనికులూ, ఆయుధధారులైన ప్రజలూ ఒక తృటికాలం స్థాణువుల్లా వుండిపోయారు. ఆ వెంటనే సైనికుల్లోనుంచి కొందరు, "నరవాహన మహారాజుకూ జై!" అంటూ కత్తులు దూసి ముందుకురికారు.

ఆయుధధారులైన ప్రజల్లో కలకలం బయలుదేరింది. వాళ్ళల్లోనుంచి కొందరు యువకులు ముందుకు వచ్చి, "సమర సేనుడికీ జై!" అంటూ సైనికులమీద కలియబడ్డారు.

ఇక అప్పుడు చెలరేగిన గందరగోళాన్ని యుద్ధమనేందుకు వీల్లేదు. ఆయుధధారి అయిన ప్రతివాడికీ, ఆయుధం ధరించి వున్న మరొకడు శత్రువు! తన పక్కన, మరొకడితో కత్తియుద్ధం చేస్తున్నవాడు మిత్రుడో, శత్రువో ఆ పక్కవాడికి తెలీదు. కొందరు సమరసేనుడికీ, మరి కొందరు నరవాహనుడికీ జైజైనినాదాలు చేస్తున్నారు. ఆ కల్లోలంలో ఎవరి నోటినుంచి ఏ నినాదం వచ్చిందో స్పష్టంగా విని, వాణ్ణి శత్రువు కిందో, మిత్రుడికిందో పోల్చుకునేందుకు అవకాశం లేదు.

నేను, పోరాటం సాగిస్తూనే, అనుచరులతో క్రమంగా కోటద్వారం కేసి తిరోగ



మించాను. ద్వారరక్షకులు నన్ను చూస్తూనే కోట ద్వారం తెరిచి, నేను లోపల ప్రవేశించగానే, ద్వారం మూసేశారు. ఈ విధంగా అప్పటికి ఆ గంధరగోళాన్నించి బయటపడి కోటలో ప్రవేశించాను.

బయట వీధుల్లో సంకులసమరం సాగుతోంది. సైన్యంలో కొంత భాగం, ప్రజలూ సమరసేనుడి పక్షం; మిగతా సైన్యం నరవాహనుడి పక్షం. యుద్ధరంగంలో వాస్తవంగా ఏం జరిగిందో తెలుసుకుంటేతప్ప, లేకపోతే యీ గందరగోళం ఇలాగే సాగుతుందని పించింది. నా అనుచరుల్లో వొకణ్ణి పిలిచి, రహస్యద్వారంగుండా అతణ్ణి యుద్ధభూమికేసి పంపాను. పోతే, ఇప్పుడు తెలియవలసింది, పట్టణంలోని నరవాహనుడి అనుచరుల ముందు కార్యక్రమం. వాళ్లు తమను ఎదిరించే వాళ్ళను మట్టు పెట్టిం తరవాత, కోటను వశపరుచుకునేందుకు ప్రయత్నిస్తారా అన్నది సమస్య! నేను మాత్రం, నా సర్వశక్తులా కోటను రక్షించ దలిచాను. నా కొద్దిమంది అనుచరులూ, కోటలోవున్న నలభై యాభై మంది సైనికులూ కోట రక్షణకు ఎంతోకాలం నిలబడలేరని నాకు తెలుసు. అంత గత్యంతరం లేనప్పుడు, లోగడ చేసినవిధంగా క్రూర




మృగాలను బోనుల్లోనుంచి వదలటం ఒక్కటే మార్గాంతరంగా కనిపించింది.

ఒక గంటకాలం గడిచింది. బయట వీధుల్లో ఇంకా పోరాటం సాగుతూనేవుంది. నేను కోట రహస్యద్వారంనుంచి పంపిన సైనికుడు కొద్దిసేపటికి తిరిగివచ్చాడు. అతడు యుద్ధరంగంనుంచి తెచ్చినదుర్వార్త నా హృదయాన్ని శూలంలా తాకింది.

శత్రువులతో జరిగిన పోరులో సమరసేనుడు బాగా గాయపడ్డాడు. దానితో అంతవరకూ ఉపసేనానిగా వున్న నరవాహనుడు, సేనానాయకత్వం స్వీకరించి, కుండలినీ ద్వీపానికి రాజుగా ప్రకటించు కున్నాడు.







ఆ వార్త చెప్పేందుకే అతడి అనుచరులు కొందరు నగరంలో ప్రవేశించారు!

"సమరసేనుడి పరిస్థితి ఎలావుంది? మాట్లాడే స్థితిలో ఉన్నాడా లేడా?" అని అడిగాను, వార్త తెచ్చిన సైనికుణ్ణి.

"ఆయన బాగా గాయపడ్డాడు. ఇప్పుడో ఇంకా సేపటికో అన్నట్టుగా ఉంది ఆయన స్థితి. ఆ అదను తీసుకునే, నరవాహనుడు రాజుగా ప్రకటించుకున్నాడు. సేనలో ఉన్న చిన్నచిన్న నాయకులందరూ అతణ్ణి బల పరుస్తున్నారు." అని చెప్పాడు సైనికుడు.

పరిస్థితి చేజారిపోయిందని నేను గ్రహించాను. కొద్దిసేపట్లో నరవాహనుడే తన సైన్యాలతో స్వయంగా నగరం మీదికి వస్తాడు. ఇక అప్పుడు అతణ్ణి ఎదిరించే శక్తి కుండలినీద్వీపంలో ఎవరికీ వుండదు. అతడికి నేనంటే వున్న ద్వేషంకూడా నాకు తెలియందికాదు. వీటన్నిటి దృష్ట్యా, సాధ్యమైనంత తొందరగా కోటను వదిలి, రహస్య ద్వారంగుండా నా అనుచరులతో సహ బయటపడటం మంచిదనుకున్నాను.

నా అనుచరులందర్నీ ఒక చోట చేర్చి, పరిస్థితి వివరించాను. నా అభిప్రాయంతో అందరూ ఏకీభవించారు. ఇక చేయవలసిందల్లా గుట్టుచప్పుడు కాకుండా రహస్య ద్వారాన్నుంచి బయటపడటం. కోటనుంచి బయటికి అలాంటి రహస్య ద్వారం వున్నదన్న సంగతి నరవాహనుడికి తెలియంది కాదు. అందుచేత ఎంతో జాగ్రత్తగా పని నెరవేర్చుకోవలసి వుంటుంది.

నా అనుచరు లందరినీ హెచ్చరించి ప్రాసాదం లోపలికి బయలుదేరాను. నేను అలా కొద్దిదూరం వెళ్ళానో లేదో, ద్వారం వేపునుంచి కేకలు వినిపించినై. వెనుదిరిగి చూతునుగదా, నరవాహనుడి పక్ష సైనికులు కొందరు, ద్వారానికున్న ఇనుప కమ్ములను పెద్ద పెద్ద దుంగలతో బాదుతూ, వాటిని విరగగొట్టేందుకు ప్రయత్నిస్తున్నారు.



నాకు చప్పున ఒక ఉపాయం తోచింది. లోగడ చేసినవిధంగానే, మృగశాలాధిపతిని పిలిచి క్రూరమృగాలను బోనుల్లోనుంచి వదలమని ఆజ్ఞాపించాను. అతడు నాకేసి చిరునవ్వు నవ్వి, "శివదత్తా! నీ శత్రువు లెవరో నాకు తెలియదుకాని, వాళ్లు మాత్రం నీకన్న తెలివైనవారు. గంటకింద వాటి మేత విషయం పర్యవేక్షించేందుకు బోనుల దగ్గిరికి వెళ్ళాను. ఆశ్చర్యకరమైన సంగతి; వాటిల్లో చాలావరకు చచ్చిపోయివున్నవి. కొన్ని బాధతో మూలుగుతున్నవి," అన్నాడు.

నేను మారు మాటాడకుండా, బోనుల దగ్గిరకు పరిగెత్తాను. మృగశాలాధిపతి చెప్పిన మాటల్లో అసత్యం ఏమీలేదు. అయితే, జంతువులకు విషంపెట్టినది ఈ మృగశాలాధిపతా? లేక మరెవరైనా నరవాహనుడి అనుచరుడా? నాకున్న కొద్దిపాటి వ్యవధిలో ఆ నిజానిజాలు తెలుసుకునే అవకాశం లేదు. ఎందుకైనా మంచిదని మృగశాలాధిపతిని పెడరెక్కలు విరిచికట్టించి, ఒక గదిమూల పడవేసి, నేను రహస్య ద్వారంకేసి పరిగెత్తాను.

రహస్య ద్వారం చిత్రసేనమహారాజు శయనాగారంలో వున్నది. అక్కడినుంచి ఒక సన్నని సొరంగం ప్రారంభమై, కోట చుట్టూ వున్న అగడ్తకిందుగా పోయి, బయట ఒక క్రోసు దూరంలో వున్న అడవిలో ఒక పెద్ద మాను బోదెలో అంతమవుతుంది.

నా అనుచరులతో నేను చిత్రసేనుడి శయనాగారం ప్రవేశించేసరికి, ఆ మహారాజు భౌతికకాయం మాట గుర్తుకొచ్చింది. పాపం, ఇంతవరకూ దహనసంస్కారం లేకుండా ఆ శవం ఎక్కడో ఒక గదిలో పడివుంది. అతడి పరిపాలనా, చావూ-అంతా విషాదాంతంగా పరిణమించింది.

రహస్య ద్వారం తెరిచి, ముందుకు చూచాను. అంతా కారుచీకటిగా వుంది!

(ఇంకా వుంది)



# పేదవాడికి విందు

ఒకనాడు ఉదయం కొందరు రైతులు రచ్చబండవద్ద చేరి కబుర్లు చెప్పుకుంటున్నారు. ఊరి కోమటి అటుగావస్తూ ఆగి, తనకోసం జమీందారుగారు కబురు చేశారనీ, తాను వారి ఇంటికి వెళ్లి చాలాసేపు కూచుని వ్యవహారాలు మాట్లాడి వచ్చాననీ గొప్పలు చెప్పుకోసాగాడు.

ఇదంతా విని ఒక పేదరైతుకు మండిపోయి, "ఇదేంమంత గొప్ప! తలచుకున్నానంటే నేను జమీందారుగారింట విందుభోజనం చేసిరాగలను!" అన్నాడు హేళనగా.

"ఈ జన్మలో చూడం!" అన్నాడు కోమటాయన.

"ఏమిటి పందెం?" అన్నాడు రైతు.

పేదరైతు జమీందారు ఇంట భోజనంచేస్తే కోమటి అతనికి ఒకజత ఎద్దులు కొనెట్టూ, భోజనం చెయ్యాలేకపోతే రైతు కోమటి పొలం మూడేళ్ళపాటు ఉచితంగా సాగుచేసి పెట్టేట్టూ పందెం వేసుకున్నారు. ఇందుకు మిగిలిన రైతులు సాక్షులు.

పేదరైతు నేరుగా జమీందారు ఇంటికి వెళ్లి, జమీందారుతో, "బాబూ, తమర్ని రహస్యంగా అడగాలను కున్నాను. కోడిగుడ్డంత బంగారం ఏపాటి ఖరీదు చేస్తుంది?" అన్నాడు.

"కూర్చో, కూర్చో! భోంచేసి తాపీగా మాట్లాడుకుందాం!" అన్నాడు జమీందారు. జమీందారు తనతోపాటే రైతుకుకూడా వడ్డనచేయించాడు. ఇద్దరూ సుష్టుగా భోజనంచేశారు.

"ఏది, నీ బంగారం పట్టుకురా! నిన్ను దగాచెయ్యనులే," అన్నాడు జమీందారు.

"నాదగ్గిర బంగార మెక్కడిది. కోడిగుడ్డంత బంగారం ఎంత ధర ఉంటుందో తెలుసుకుందామని అడిగాను. అంతే!" అన్నాడు రైతు.

"పోరా బుద్ధిహీనుడా!" అని జమీందారు కోపంగా అరిచాడు.

"నాకు భోజనంపెట్టిన తమరూ, ఎద్దులజత కొనిపెడుతున్న కోమటీ వుండగా, మధ్య నేను బుద్ధిహీనుణ్ణి ఎందుకవుతా లెండి?" అంటూ రైతు యింటిదారి పట్టాడు.



# కాంతికవి కనువిప్పు

భోజరాజు ఆస్థానంలో కాళిదాసు మొదలైన దిగ్గజాలవంటి పండిత కవులున్నారన్న ప్రతీతి దశదిశలా వ్యాపించింది. ధారానగరంలో చమత్కార కవిత్వం సామాన్యులుకూడా చెబుతారన్న వార్తలు కొందరు నమ్మలేకపోయారు. కాంతి కవి అనే ఉద్దండ పండితుడు, ఈ కథ ఎంతవరకు నిజమో తెలుసుకుని, అబద్ధమైతే కాళిదాసాదులను అవమానించి పోదామని ధారానగరానికి బయలుదేరి వచ్చాడు.

కాంతికవి ధారానగరంలోకి అడుగుపెట్టి కొద్దిదూరం నడిచాడో లేదో ఊరబావినుంచి బిందెలతో నీరు తెచ్చుకునే స్త్రీలు ఒకరి తరవాత ఒకరు కనిపించారు. కాంతికవి ఒక పిల్లను పలకరించి, "నువ్వెవరమ్మా?" అని అడిగాడు. ఆ పిల్ల ఇలా జవాబిచ్చింది.

"హరహర స్మరతే నిత్యం
బహుజీవ ప్రపాలకః
అరణ్యే వసతే నిత్యం
తస్యా హం కుల బాలికా."

(ఎప్పుడూ అరణ్యాలలో నివసిస్తూ, 'హరహరా' అని కేకలువేస్తూ, జీవకోటిని పోషించే వారి పిల్లను.)

ఆ పిల్ల కాపువాళ్ల పిల్ల. కాపులు అడవిలో సేద్యంచేస్తారు. "హర్, హర్," అని ఎద్దుల్ని అదలిస్తూ పొలాలు దున్నుతారు.

ఇంతలో మరొక స్త్రీ అటుగా వచ్చింది. ఆమెను కాంతికవి "నువ్వెవరమ్మా?" అని అడిగాడు. ఆమె ఈవిధంగా జవాబిచ్చింది.

"చతుర్ముఖో నచ బ్రహ్మా,
వృషారూఢో నశంకరః,
అకాలే వర్షతే మేఘః
తస్యా హం కుల బాలికా."

(నాలుగు ముఖాలుంటాయి గాని బ్రహ్మ కాదు, ఎద్దు ఎక్కినా శివుడుకాదు, అకాలంగా వర్షించే మేఘం గల వారిపిల్లను.)

కె. కృష్ణమాచార్యులు

ఈమె భిస్తీవాళ్ల పిల్ల. భిస్తీలు ఎద్దులమీద తోలుతిత్తులలో నీరు పోసుకుని అడిగినవారికి నీరు పోస్తూంటారు. ఈ తిత్తులకు నాలుగువైపులా మూతులుంటాయి. ఈమె చాకచక్యానికి కాంతికవి నిశ్చేష్టుడయాడు.

మరొక స్త్రీ ఇలా చెప్పింది.

"నిర్జీవో జీవితో వాపి
శ్వాసో చ్ఛ్వాస విశేషతః,
కుటుంబ కలహో నాస్తి
తస్యాహం కుల బాలికా."

(ప్రాణం లేకపోయినా ఉన్నట్టే ఊపిరి తీసి విడుస్తూ, కుటుంబ కలహాలెరగనిదాని [గాలితిత్తి]తో పనిచేసే [కమ్మరి] కూతుర్ని)

ఇంకొక యువతి ఇలా చెప్పింది:

"ద్విరాజా, నగరీ ఏకా
నిత్యం యుద్ధంచ జాయతే
తదుత్పత్తి కరోయస్తు
తస్యాహం కుల బాలికా."

(ఒక పట్టణానికి గల యిద్దరు రాజులూ అస్తమానమూ సంఘర్షణ పడుతూంటారు. [రెండు ఇరుసులుగల రాటం] దాన్ని నిర్మించే [వడ్రంగి] వారి కూతుర్ని.)

వేరొక కన్య ఇలా చెప్పింది.

"చక్రైకం నరథీ సూర్యో
భూమౌ తిష్ఠతి సారథిః,
అగస్త్యతాత నిర్మాణః
తస్యాహం కుల బాలికా."

(ఒకే చక్రం. కాని సవారీ చేసేది సూర్యుడు కాదు. సారథి మటుకు భూమి మీదే ఉంటాడు. అగస్త్యుడి తండ్రులను [కుండలను] చేసే [కుమ్మరి] వారి పిల్లను.)

ధారానగరం సామాన్య కుటుంబాలలో పుట్టిన స్త్రీలకే ఇంత కవితాశక్తి, వాక్చమత్కృతీ ఉండటం చూసి నివ్వెరపోయి కాంతికవి, తాను భోజరాజు గురించి విన్న మాటల్లో అతిశయోక్తి ఏమాత్రం లేదని తెలుసుకున్నాడు.





# గర్భశత్రువులు

పూర్వం రాఢా నగరాన్ని ఉగ్రభట్టు అనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయనకు మనోరమ అని భార్య ఉండేది. భార్యాభర్త లిద్దరూ చాలా అన్యోన్యంగా ఉండేవారు.

ఇలా ఉండగా ఒక రోజున దూరదేశం నుంచి ఒక నటకుల బృందం వచ్చి రాజుగారి ఎదుట, "సముద్ర మథనం" నాటకం ఆడారు. దేవతలూ, దానవులూ కలిసి పాల సముద్రాన్ని మథించిన పిమ్మట మహా విష్ణువు మోహినీ రూపంలో వచ్చి అమృతం పంచిపెట్టే సన్నివేశంలో మోహినీ పాత్రను లాస్యవతి అనేపిల్ల, నాటకాలాడించే వాడి కుమార్తె, ధరించింది. లాస్యవతి నిజంగా నవమోహిని. అమె చక్కదనమూ, అభినయమూ చూసి ఉగ్రభట్టు ఆమెయందు ప్రేమ ఏర్పడినవాడై, తన కామెనిచ్చి పెళ్లి చేయమని నాటకం ఆడించిన మనిషిని కోరాడు. ఆ దరిద్రుడికి అంతకంటె కావల సిన దేముందీ? అతను వెంటనే ఒప్పుకున్నాడు. లాస్యవతి రాఢానగరపు రాజు చిన్నభార్య అయింది.

కొంతకాలానికి మనోరమకు ఒక కుమారుడూ, లాస్యవతికి ఒకకుమారుడూ కలిగారు. మనోరమ కుమారుడికి భీమభట్టు అనీ, లాస్యవతి కుమారుడికి సమరభట్టు అనీ రాజు నామకరణం చేశాడు. ఇద్దరిలో భీమభట్టు, కొంచెం పెద్దవాడు.

ఇద్దరు రాజకుమారులూ పెరిగి పెద్దవారై వచ్చేటప్పుడు ప్రతి విషయంలోనూ భీమభట్టు సమరభట్టుకన్న ఎక్కువగా ఉంటూవచ్చేవాడు. ఇది చూసి సమరభట్టు అన్నపై అసూయగా ఉండేవాడు. ఒకనాడు వారిద్దరూ కుస్తీపందెం పట్టుతూండగా సమరభట్టు తన అన్నను బుద్ధిపూర్వకంగా గొంతుమీద కొట్టాడు. వస్తుతహా బలంగల వాడైన భీమభట్టు మండిపడి సమరభట్టును

డి. వెంకటేశ్వరరావు

చావచితకగొట్టేశాడు. ముక్కునా నోటా రక్తం కక్కుతూ సమరభట్టు పడిపోయాడు. అతన్ని స్నేహితులు తల్లిదగ్గిరికి చేర్చారు.

లాస్యవతి కొడుకుస్థితి చూసి గొల్లున ఏడవసాగింది. ఇంతలోనే రాజు అక్కడికి వచ్చి జరిగిన సంగతి తెలుసుకొన్నాడు.

"భీమభట్టు అవకాశం దొరికినప్పుడల్లా నా కొడుకును ఇలా కొడుతూనే ఉన్నాడు. నేను మీతో చెప్పటంలేదు. ఎప్పుడో పిల్లవాణ్ణి చంపేస్తాడని నాకు భయంగా ఉంది," అని లాస్యవతి రాజుతో చెప్పుకుని ఏడ్చింది.

రాజుకు తన చిన్న భార్యపైనా, ఆమె కొడుకుపైనా మమకారం జాస్తి. అందుచేత ఆయన తన పెద్దకొడుకును అంతఃపురం వదలి వెళ్ళిపొమ్మనీ, ఇంకెక్కడన్నా బతకమనీ ఆజ్ఞాపించాడు.

ఈ సంగతి విని పెద్దరాణి మనోరమ కన్నీరు పెట్టుకుని, భీమభట్టుతో, "నాయనా, నీమీద చిన్నరాణీగాని, ఆమె కొడుకుగాని, ఏ చాడీలు చెప్పినా రాజు నమ్ముతాడు. అందుచేత నువ్విక్కడ ఉండటం క్షేమం కాదు. అంతఃపురం వదిలి ఎవరిపంచనో పడి ఉండవలసినంత కర్మ నీకేం వచ్చింది? పాటలీపుత్రం వెళ్లు. మీతాతగారింట ఉండు. వాళ్లకూ మగసంతానం లేదుగనక నిన్ను



పువ్వుల్లోపెట్టి పెంచుతారు!" అని చెప్పింది.

భీమభట్టుకు ఆగ్రహం కలిగింది. "అదేమిటమ్మా? సమరభట్టుకు దడిచి నేను దేశంవదలి పారిపోతానా? క్షత్రియబిడ్డను కానా? వాడు నన్నేమీ చెయ్యలేడు. నువ్వు ధైర్యంగా ఉండు," అన్నాడు.

"అలా అయితే, నీ కెంతడబ్బు కావాలన్నా ఇస్తాను. నీకు కావలసిన బలాలను నీవు పోగుచేసుకో. అవసరంవస్తే అండగా ఉంటారు," అన్నది మనోరమ.

"వద్దమ్మా! నే నాపని చేయటం రాజద్రోహంగా కనిపిస్తుంది," అంటూ భీమభట్టు తల్లివద్ద సెలవు తీసుకుని వెళ్లాడు.

రాజు పెద్దకొడుకును ఇంటినుంచి వెళ్ల గొట్టాడని తెలియగానే ప్రజలు రాజును నిందించారు. ఎందుకంటే సమరభట్టు ఏ విధంగానూ రాజ్యార్హుడు కాడని ప్రజ ఎరుగుదురు. అందుచేత వారు చందాలు వసూలు చేసి భీమభట్టుకు చక్కని వసతి సౌకర్యాలూ, నౌకర్లూ ఏర్పాటుచేశారు.

భీమభట్టుకు ప్రజల అండ ఎంతగా ఉన్నా సమరభట్టుకు రాజు అండ దండలున్నాయి. అందుచేత అతను తన అన్నను చంపించటానికి చాలా యత్నాలు చేశాడు. ఇది చూసి శంఖదత్తుడనే బ్రాహ్మణ యువకుడికి చాలా బాధ కలిగింది.

శంఖదత్తుడు రాజకుమారుల ఈడువాడే. బ్రాహ్మణయువకుడై ఉండి కూడా అతను అమిత పరాక్రమవంతుడు. అతనికి రాజకుమారు లిద్దరితోనూ స్నేహం ఉంది. అందుచేత అత నొకనాడు సమరభట్టును చూడబోయి, "నీకు మీ అన్నతో జగడం ఎందుకోయి? అతనిమీద నీ పరాక్రమం ఎందుకూ పనికిరాదు సరేకదా, అతనికి అపకారం చెయ్యాలని ప్రయత్నించటంవల్ల నీకే మరింత అపకీర్తి!" అని మందలించాడు.

ఆ మాటలు విని బుద్ధితెచ్చుకోవటానికి బదులు సమరభట్టు శంఖదత్తుణ్ణి నానా తిట్లూ తిట్టసాగాడు.



"సరే, నీకు మంచిసలహా విషమయింది. కాని ఒకటి తెలుసుకో. నీకు భీమభట్టు గర్భ శత్రువయేపక్షంలో, నన్నుకూడా అలాగే జమకట్టుకో. ఎందుకంటే, ఈ నాటినుండి నేను నీ మిత్రుణ్ణికాను. ఇద్దరికీ మిత్రుడుగా ఉండ యత్నించినందుకు నన్ను చాలా తేలిక చేసి మాట్లాడావు. దీనికి ఫలం అనుభ విస్తావులే!" అని శంఖదత్తుడు వెళ్లిపోయాడు.

ఇది జరిగిన కొద్దికాలానికే రాఘానగరా నికి ఒక వర్తకుడు ఒక పంచకల్యాణీ గుర్రాన్ని అమ్మటానికి తెచ్చాడు. ఈ సంగతి తెలియగానే శంఖదత్తుడు ఆ గుర్రాన్ని భీమభట్టుకోసం బేరంకుదిర్చాడు. ఈమాట సమరభట్టుదాకా వెళ్లింది. అతను తన అనుచరులతో వర్తకుడి దగ్గిరికి వెళ్లి "ఏమయ్యా, నీ గుర్రాన్ని నేను రెట్టింపు వెలకు కొంటాను. దాన్ని నాకే ఇచ్చెయ్యి!" అని మహాదర్పంగా అడిగాడు.

"బాబూ, వర్తకంలో నీతి పాటించాలి. ఒకరికి ముందుగా మాట ఇచ్చిన గుర్రాన్ని ధనాశచేత మరొకరికి ఏవిధంగా అమ్మేది?" అన్నాడు వర్తకుడు.

"అంత నీతిమంతుడవా! ఒరే, చూస్తా రేంరా! గుర్రాన్ని తీసుకుపదండి!" అని అనుచరులతో చెప్పాడు సమరభట్టు. అను చరులు గుర్రాన్నితీసుకుని బయలుదేరారు.





ఈ సంగతి భీమభట్టుకూ, శంఖదత్తుడికీ తెలిసింది. వారిద్దరూ కత్తులు దూసి వచ్చారు. సమరభట్టు అనుచరులకూ, వారిద్దరికీ మధ్య యుద్ధం జరిగింది. ఇద్దరూ కలిసి సమరభట్టు అనుచరులను చంపేశారు. తన ప్రాణానికి ఎసరు వచ్చిందని గ్రహించి సమరభట్టు పారిపోసాగాడు. కాని శంఖదత్తుడు పులిలాగా పరిగెత్తి సమరభట్టును చేజిక్కించుకుని, అతని జుట్టు పట్టుకుని వంచి ఖడ్గంతో తల నరకబోయాడు.

ఇంతలో భీమభట్టువచ్చి, "వాణ్ణిచంపకు! చంపితే, పాపం, మా నాయన ఏంకాను? ఇప్పుడాయనకు ఉన్నదే ఒక్కకొడుకు!" అన్నాడు వెటకారంగా. శంఖదత్తుడు, "బతికిపోయావు, పో!" అని సమరభట్టును విడిచిపుచ్చాడు. సమరభట్టు ఎకాఎకీ తన తండ్రివద్దకు పోయి, భీమభట్టు తన అనుచరులను చంపి, తనను కూడా చంపయత్నించి, తాను కొనుక్కున్న పంచకళ్యాణీ గుర్రాన్ని కాజేసినట్టు చెప్పాడు.

ఈ సంగతి తెలియగానే మనోరమ ఒక కుండలో రత్నాలుపోసి, ఆ కుండను ఒక బ్రాహ్మడిచేతి కిచ్చి, "బాబూ, ఎవరికీ తెలియకుండా దీనిని నా కుమారుడి కిచ్చి, ఈ రాత్రే బయలుదేరి వాణ్ణి మా నాయనగారి దేశం వెళ్ళమని చెప్పు. తెల్లవారి వాడీ రాజ్యంలో కనిపిస్తేవాడి ప్రాణాలు దక్కవని చెప్పు. ఈ ధనాన్ని పగ తీర్చుకోవటానికై వినియోగించమను," అని చెప్పింది.

భీమభట్టు తల్లిచెప్పిన ప్రకారం ఆ రాత్రే ప్రయాణమైనాడు. అతడు పంచకల్యాణీ మీద కుండతోసహా ఎక్కాడు. అతని కష్టసుఖాలలో భాగం పంచుకోవటానికి సిద్ధపడిన శంఖదత్తుడు మరొక గుర్రం ఎక్కాడు. తెల్లవారేలోపుగా ఇద్దరూ నగరం పొలిమేర దాటారు.

మర్నాడు మధ్యాన్నం వారు ఒక మైదానం ప్రవేశించారు. అక్కడ రెల్లు

దట్టంగా పెరిగి ఉంది. వారి గుర్రాలు రెల్లు మధ్యగా అతి వేగంతో పోతుండటంవల్ల, ఆ చప్పుడుకు రెల్లులో నిద్రపోతున్న సింహాలు కొన్ని లేచి గుర్రాలమీదికి లంఘించాయి. భీమభట్టూ, శంఖదత్తుడూ కత్తులు దూసి నేర్పుతో సింహా లన్నిటినీ చంపేశారు. కాని వా రెక్కిన గుర్రాలను సింహాలు తీవ్రంగా గాయపరచటంవల్ల అవి చచ్చిపోయాయి.

వారి కిక కాలినడక తప్పలేదు. రెల్లుకు పాదాలు కోసుకుపోతున్నాయి. ఈ రెల్లులో ఇంకా ఎన్ని సింహాలున్నాయో తెలియదు. ఇన్నిటికీ తోడు చీకటి పడింది! అయినా దేవుడిమీద భారం వేసి వారు తెల్లవార్లూ నడిచి గంగానదీ తీరం చేరారు.

గంగ నిండు వెల్లువగా ప్రవహిస్తోంది. చుట్టుపక్కల ఎక్కడా జనసంచారంగాని, నది దాటే సాధనంకాని లేదు. గట్టువెంబడి కొంతదూరం వెళ్లగా వారికొక కుటీరం కనిపించింది. అందులో ఒక యువకుడు మాత్రం ఉన్నాడు. ఆ యువకుడు చాలా కాలం కాశీలో చదివి తన ఊరికి తిరిగి వెళ్లే సరికి అతని బంధువులంతా చనిపోయారని తెలిసిందట. అనాథుడికి, డబ్బులేనివాడి కెవరు పిల్లనిస్తారు? అందుచేత అతను జీవితంమీద విరక్తిచెంది ఇక్కడ ఈ నిర్జన




ప్రదేశంలో ఆశ్రమం కట్టుకుని తపస్సు చేసుకుంటున్నాడు.

ఇదంతా తెలుసుకుని భీమభట్టు తనవద్ద ఉన్న రత్నాలకుండను ఆకుర్రవాడి కిచ్చేసి, "బాబూ, నువ్వు మీ వూరికి తిరిగివెళ్లి వివాహం చేసుకుని సుఖపడు. మాకీకుండ ప్రతిబంధకంగా ఉన్నది," అన్నాడు.

ఆ తరువాత స్నేహితు లిద్దరూ సాహసించి గంగకు అడ్డంగా పడి, ఈదటానికి తలపడ్డారు. కాని ప్రవాహం చాలా బలంగా ఉండటంవల్ల ఇద్దరూ దానివెంబడి పడి కొట్టుకు పోసాగారు. చాలాదూరం ఈ విధంగా కొట్టుకుపోయాక భీమభట్టు అప

తలి ఒడ్డుకు చేరుకున్నాడు. శంఖదత్తు డేమైపోయాడో ఎక్కడా కనిపించలేదు. అతన్ని వెతుకుతూ భీమభట్టు నదీతీరం వెంబడి వెళ్లివెళ్లి లాటదేశం చేరాడు.

ఈ విధంగా భీమభట్టు తన తల్లినీ, దేశాన్నీ, రాజ్యాన్నీ, ధనాన్నీ, మిత్రుణ్ణీ కోల్పోయి నిస్సహాయుడుగా లాట నగరం లోకి అడుగుపెట్టగానే అతనికి ఒకచోట జూదమాడుతున్న యువకులు కొందరు కనిపించారు. భీమభట్టు తానుకూడా వారితో జూదమాడతానన్నాడు. అతని దగ్గిర ఏమైనా ఉంటే కాజేదామని వారు సమ్మతించారు. అయితే కొద్దిసేపట్లోనే భీమభట్టు వారివద్దనున్న సొమ్మంతా గెలుచుకున్నాడు. జూదగాళ్లు వెళ్లిపోతుండగా అతను వారిని ఆపి, "మిత్రులారా, నేను జూదరిని కాను. కనుక, మీ సొమ్ము మీరు తిరిగి పుచ్చుకొని మరీ వెళ్లండి." అన్నాడు భీమభట్టు.

"అయితే దేనికి మాతో జూదమాడావు?" అని వా రడిగారు.

"నేను ఒంటరివాణ్ణి. మీ స్నేహంకోరి ఆటలో కూచున్నాను," అన్నాడు భీమభట్టు. జూదగాళ్ళు సంతోషించి, అతనితో మిత్ర ప్రమాణాలు చేశారు.

కొద్దికాలం జరిగింది. లాటదేశంలో ఏటా వాసుకి ఉత్సవం చేస్తారు. ఆ ఉత్సవం



నాడు భీమభట్టు తన మిత్రులతో సంబరం చూడబోయాడు. అక్కడ అతనికి ఆ దేశపు రాజకుమార్తె కనిపించింది. అతనికి ఆమెను పెళ్ళాడాలన్న కోరిక పుట్టింది.

ఈ సంగతి కనిపెట్టి అతని మిత్రులు భీమభట్టుకు రాజోచితమైన దుస్తులు ధరింపజేసి, రాజుగారిని చూడబోయారు. భీమభట్టు రాఢాదేశపు రాజు కొడుకనీ, తన కుమార్తెను కోరి వచ్చాడనీ తెలియగానే లాటరాజు వెంటనే పెళ్ళికి ఒప్పుకుని ఇద్దరికీ మంచి ముహూర్తాన వివాహంచేశాడు.

శంఖదత్తుడుకూడా గంగనుంచి సురక్షితంగా బయటపడి తన మిత్రుడికోసం తెగ వెతికాడు. లాటరాజు కుమార్తె వివాహం సంగతి నలుగురూ చెప్పుకోగా భీమభట్టు ఆ దేశం చేరినట్టు గ్రహించి, శంఖదత్తుడు కూడా వచ్చి చేరాడు. పోయాడనుకున్న మిత్రుడు మళ్ళీ కనిపించేసరికి భీమభట్టు మితిలేని ఆనందం పొందాడు.

మరి కొంతకాలం గడిచింది. లాటరాజుకు ఇద్దరు కుమార్తెలే తప్ప కొడుకులు లేనందున భీమభట్టు లాటరాజయాడు. కాలక్రమాన ఉగ్రభట్టు చనిపోయి, సమరభట్టు రాఢానగరానికి రాజయాడు. ఈ సంగతి తెలిసి భీమభట్టు తన తమ్ముడి దగ్గిరికి ఒక రాయబారిని పంపుతూ,



"నీచుడా, నువు సింహాసనం ఎక్కటానికి అర్హుడివి కావు. మంచిగా రాజ్యం నాపరం చేస్తావా ? యుద్ధానికి సిద్ధమవుతావా ?" అని కబురుచేశాడు.

సమరభట్టు యుద్ధానికే సిద్ధపడ్డాడు. భీమభట్టు యుద్ధయత్నాలు సాగించమని తన మిత్రులకు చెప్పాడు. వారు కొద్దిరోజులలోనే ప్రజలలోకి వెళ్ళి పెద్దసేనను సమకూర్చారు. భీమభట్టు సైన్యంతోసహా రాధానగరంమీదికి వచ్చాడు.

పెద్ద యుద్ధం జరిగింది. యుద్ధంలో గర్భశత్రువులైన అన్నదమ్ము లిద్దరూ తలపడ్డారు. ఒకరి వాహనాలు ఒకరు ఛేదించుకున్నారు. ఒకరి బాణాలను ఒకరు విరగగొట్టుకున్నారు. కత్తులు దూసి కాల్బంట్లలాగా కలియబడ్డారు. కొద్దిసేపట్లో సమరభట్టు చేతికత్తిని భీమభట్టు ఎగరగొట్టేశాడు. భీమభట్టు కత్తి మొన సమరభట్టు రొమ్ము తాకింది. అతను భయంతో వణకసాగాడు.

"పిరికిపందా! నిన్ను నేను చంపను. చంపితే నిన్ను గారాబంగా పెంచి ఇంత పెద్దవాణ్ణి చేసిన మీ అమ్మ గతి ఏంకాను? పో! ప్రాణాలతోవెళ్ళి ఆవిడకు కనిపించు," అన్నాడు భీమభట్టు కోపంగా.

భీమభట్టు తనకు రావలసిన రాధానగరపు సింహాసనాన్ని ఇంతకాలానికి ఎక్కాడు. తన సేనలకు నాయకత్వం వహించిన శంఖదత్తుకూ, తనకోసం ప్రాణాలొడ్డి పోరిన తన మిత్రులకూ గొప్పగా సన్మానాలుచేశాడు. లాటదేశపురాజు రెండవ కుమార్తెను శంఖదత్తుడికిచ్చి పెళ్ళిచేసి, లాటరాజ్యాన్ని అతనికి కానుకగా ఇచ్చాడు. మిగిలిన మిత్రులందరినీ తనకు సామంతులుగా చేసుకుని వారికి జాగీర్లిచ్చాడు.

రాజ్యం ఏలినచోట భరణం తీసుకుని బతకటానికి మొహం చెల్లక, సమరభట్టు తన తల్లితోసహా తన మేనమామల వద్దకు వెళ్ళిపోయాడు.



# మృతసంజీవనీ మంత్రం

విక్రమార్కుడు పట్టుదలతో వెనక్కు తిరిగి వెళ్లి, చెట్టుమీది నుంచి శవాన్ని దించి, భుజంమీద వేసుకుని, సన్యాసిదగ్గిరికి మళ్లీ ప్రయాణమయాడు. అప్పుడు, శవంలో వున్న బేతాళుడు రాజుతో, "రాజా! నీ కెంత దుస్థితి కలిగింది! అయినా, దాన్ని మరిచిపోవటానికి నీకు మంచి కథ ఒకటి చెబుతాను, విను," అంటూ యీ విధంగా చెప్పసాగాడు:

యమునానదీ తీరాన బ్రహ్మస్థలమనే అగ్రహారంలో అగ్నిస్వామి అనే వేదాధ్యయనపరుడుండేవాడు. ఆయనకు మందారవతి అనే కుమార్తె ఉండేది. ఆమె రూపలావణ్యాలలో దేవతాస్త్రీలనుకూడా తలదన్నిన సౌందర్యవతి. తండ్రి ఆమెకు పెళ్లి చేద్దామనుకుంటున్న సమయంలో ఎక్కడినుండో ముగ్గురు బ్రాహ్మణ యువకులు వచ్చి, ఎవరిమటుకు వారు తామే మందార

బేతాళ కథలు



వతిని చేసుకుంటామనీ, చేసుకోలేనిపక్షంలో తప్పక ఆత్మహత్య చేసుకుంటామనీ ఘోర ప్రమాణాలు చేసి, శఠంపట్టి కూచున్నారు.

ముగ్గురు యువకులూ అందచందాల లోనూ, చదువు సంధ్యలలోనూ సమానులై ఉండటంచేత అగ్నిస్వామికి ఏమిచెయ్యాలో తోచలేదు. వారిలో ఎవరికి తన కుమార్తె నిచ్చినా మిగిలిన యిద్దరూ తప్పక ఆత్మ హత్య చేసుకుంటారని ఆ పెద్ద బ్రాహ్మడు భయపడి చూస్తూ, ఊరుకున్నాడు.

ఇలావుండగా మందారవతికి అకస్మి కంగా దాహజ్వరం పట్టుకుని కొద్దిరోజుల్లోనే మరణించింది. ముగ్గురు బ్రాహ్మణ యువ



కులూ ఆమెకోసం దుఃఖించి, ఆమె శవాన్ని శ్మశానానికి తీసుకుపోయి, యథావిధిగా దహన సంస్కారం జరిపేశారు. వారిలో ఒకడు శ్మశానంనుంచి తిరిగి రానేలేదు. మందారవతిని దహనంచేసిన చోట చిన్న పాకా వేసుకుని ఆమె చితాభస్మంలోనే పడుకుని, ఎవరన్నా తెచ్చియిచ్చిన అన్నం మాత్రం తింటూ వాడు అక్కడే కూచుని తపస్సు చేయసాగాడు.

రెండోవాడు మందారవతి అస్థికలన్నీ పోగుచేసుకుని వాటిని గంగలో కలపటానికి మూటకట్టుకుని బయలుదేరి వెళ్ళాడు.

మూడోవాడు పూర్తిగా విరాగి అయిపోయి దేశంమీదపడి తిరగసాగాడు. వాడు ఈ విధంగా చాలా దేశాలు తిరిగి ఒకనాడు వక్రోలకమనే గ్రామానికి చేరుకున్నాడు. అక్కడ ఒక బ్రాహ్మడు వాడికి ఆతిథ్యం ఇచ్చాడు. మగవాళ్లు భోజనాలకు కూచున్న సమయంలో ఇంటివారి చంటివాడు పోరు పెట్టి ఏడవసాగాడు. వడ్డన చేస్తున్న తల్లి మాటలతో ఎంత బుజ్జగించినా వాడు ఏడుపు మానలేదు. అందుకని ఇంటావిడ చంటి వాణ్ణి చేత్తో ఎత్తి మండుతున్న పొయిలో వేసేసింది. చూస్తుండగానే చంటివాడు పిడి కెడు బూడిద అయిపోయాడు.







ఇదంతా చూస్తూ వుండిన బ్రాహ్మణ యువకుడు, "ఛీ! మీరు మనుష్యులు కారు, రాక్షసులు! మీ ఆతిథ్యం ఆరగించి నేను నరకం పాలవుతాను!" అంటూ భోజనం మాని, విస్తరి ముందునుంచి గబగబా లేచాడు.

గృహస్థు, "నాయనా, తొందరపడకు. మేము రాక్షసులం కాము. మా పిల్లవాడి మీద మాకు ప్రేమ లేకపోలేదు. వాణ్ణి తిరిగి బతికించుకోవటానికి మాదగ్గిర మృత సంజీవనీ మంత్రం వుందిగనకనే నా భార్య వాణ్ణి పొయిలో పారేసింది," అన్నాడు.

బ్రాహ్మణ యువకుడు నమ్మలేదు. అందుచేత ఇంటాయన ఒక చిటికెడు దుమ్ము తీసి, చిలుక కొయ్యకు తగిలించి ఉన్న పుస్తకం ఒకటి తీసుకుని, దానిలో నుంచి ఒక మంత్రం చదివి, పొయిలోని బూడిదమీద చల్లగానే, చంటివాడు మళ్ళీ బతికి బయటికి వచ్చాడు.

బ్రాహ్మణ యువకుడు తృప్తిపడి భోజనంచేశాడు. కాని వాడి మనసంతా చిలుక కొయ్యకు వేళ్ళాడే పుస్తకంమీదే ఉన్నది. ఆ రాత్రి ఇంటివాళ్ళు నిద్రపోయే సమయంలో వాడు పుస్తకం కాస్తా సంగ్రహించి, ఎవరితోనూ చెప్పకుండా ఆ రాత్రికి రాత్రే అక్కడినించి బయలుదేరి బ్రహ్మస్థల అగ్రహారానికి తిరిగి వచ్చాడు.

మందారవతి అస్థికలను గంగలో కలపటానికి వెళ్ళినవాడుకూడా అప్పటికి తిరిగి వచ్చాడు. ఇద్దరూ కలిసి శ్మశానంలో ఉంటున్న మూడోవాడి దగ్గిరికి వెళ్ళారు.

మృతసంజీవనీ మంత్రం తెచ్చినవాడు జరిగినదంతా మిగిలిన ఇద్దరికీ చెప్పాడు. తరవాత వాడు చిటికెడు దుమ్ము తీసి, పుస్తకంలోనుంచి మంత్రం చదివి, మూడోవాడు శయ్యగా ఉపయోగించుతున్న బూడిదె మీద చల్లాడు. వెంటనే మందారవతి పూర్ణారోగ్యవంతురాలై బతికి వచ్చింది.

ముగ్గురు బ్రహ్మచారులూ ఆమెను వెంట బెట్టుకుని సరాసరి అగ్నిస్వామి ఇంటికి వెళ్లి, ఆమెను నాకిమ్మంటే నాకిమ్మని, ఆయనను బలవంతపెట్ట సాగారు.

"నేను మృతసంజీవని తెచ్చాను. దాని ప్రభావంచేతనే ఆమె బతికింది. కనక మందారవతిని నేనే పెళ్లాడాలి!" అంటాడు ఒకయువకుడు.

"నేను అస్థికలు తీసుకుపోయి గంగలో కలిపాను. ఆమె బతకటానికి అదికూడా ఒక కారణం. నేనే ఆమెను పెళ్ళాడాలి" అంటాడు మరొకడు.

"నే నామె బూడిదెను భద్రంచేసి దాన్నే అంటిపెట్టుకు పడుకున్నాను. నాకు ఆమెపైగల ప్రేమ గొప్పది. అందుచేత నేనే ఆమెను పెళ్ళాడాలి!" అంటాడు మరొకడు.

ఈ ముగ్గురిలో ఎవరికి తన కుమార్తె నివ్వాలో తోచక అగ్నిస్వామి మళ్ళీ తిక మకలో పడ్డాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఆ ముగ్గురు బ్రహ్మచారులలో మందారవతిని పెళ్ళాడటానికి అర్హుడెవరు? మృతసంజీవని తెచ్చినవాడా? అస్థికలు గంగలో కలిపిన వాడా? ఆమె చితి కాలినచోట పడుకున్న వాడా? తెలిసి చెప్పకపోయావో, నీ తల బద్దలై పోతుంది!" అన్నాడు.

"మృతసంజీవని తెచ్చినప్పటికీ ప్రాణం ఇచ్చినవాడు తండ్రి అవుతాడు. అస్థికలు గంగలో కలిపినవాడు సోదరుడవుతాడు. వీరిద్దరికీ మందారవతిని పెళ్లాడే అర్హతలేదు. మందారవతి చచ్చిపోయినా ఆమెమీది ప్రేమ కొంచెమైనా తగ్గక ఆమె భస్మాన్ని శయ్యగా చేసుకుని పడుకున్నవాడే ఆమె నిజమైన భర్త! అతడే ఆమెను పెళ్ళాడ టానికి అర్హుడు," అన్నాడు రాజు.

ఈ విధంగా రాజుకు తిరిగి మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా పారిపోయి మళ్ళీ చెట్టెక్కాడు.





# తల్లీ కూతుళ్లు

**1**

హారూన్ ఆల్ రషీద్ బగ్దాదులో ఖలీఫాగా వుండగా ఆయన రాజ్యమంతటా పావురాల టపా నడిచేది. దాన్ని నడిపినవాడు ఒక గొప్పవాడు. ఖలీఫా ఆయనను కొడుకు లాగా చూచుకోవటమేగాక ఆయనకు నెలకు వెయ్యి దీనారాలు జీతం ఇచ్చాడు.

కాలక్రమాన ఆయన చనిపోయాడు. పావురాల టపా అంతమయింది. ఆయన టపా నిమిత్తం ఉంచుకున్న పావురాలనూ, నలభైమంది నీగ్రో బానిసలనూ, నలభై వేట కుక్కలనూ ఖలీఫా తెప్పించుకున్నాడు.

పావురాల టపా అధికారికి దిలైలా అనే భార్యా, జీనాబ్ అనే కూతురూ ఉండేవారు. తన భర్త స్థానంలో తాను పావురాల టపా సాగించగలననీ, తనకు ఆ ఉద్యోగం ఇచ్చి, పూర్వం భర్త కిచ్చిన జీతమే తనకూ ఇమ్మనీ దిలైలా ఖలీఫాకు అర్జీ పెట్టుకున్నది. కాని ఈ అర్జీ బుట్ట దాఖలయింది. దిలైలా శక్తిసామర్థ్యాలు ఖలీఫా ఎరగడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే ఖలీఫా ఇద్దరు గజదొంగలను కొత్వాలు పదవికి నియమించాడు. వారిలో ఒకడి పేరు అహ్మద్, రెండోవాడి పేరు హసన్. ఇద్దరూ ఆరితేరిన దొంగలు. వారిని పట్టటానికి ఖలీఫా ఎన్నో యత్నాలు చేసి విఫలుడయాడు. దొంగతనంలో ఇంత నేర్పరితనం గల వీరిని కొత్వాళ్ళుగా నియమించటం మంచిదని ఖలీఫాకు తోచింది.

తన అర్జీని తోసివేసిన ఖలీఫా ఇద్దరు చోరులకు ఉన్నత పదవు లిచ్చాడని విని దిలైలా మండిపడింది. "ఈ దేశంలో దొంగలకూ, మోసగాళ్ళకూ గౌరవమర్యాదలు లభించేపక్షంలో, మనమేనా తక్కువ తిన్నవాళ్ళం? చూస్తూవుండు, ఈ అహ్మద్,

ఎస్. వెంకటసుబ్బయ్య



హసన్‌లు నా ముందు ఎందుకూ పనికి రారని రుజువుచేస్తాను," అన్న దామె తన కూతురు జీనాబ్‌తో.

నిజానికి దిలైలా వయసులో ముసలి దైనా యుక్తిలో చాలా గట్టిదే. ఆమె కూతురు జీనాబ్‌కూడా తల్లికేమాత్రమూ తీసిపోయేదికాదు. తల్లి ప్రతిజ్ఞ విని ఆమె చాలా సంతోషించింది.

తన మోసాలతో బగ్దాద్‌ను మారు మోగించాలని దిలైలా పట్టుపట్టింది. ఆమె సూఫీ సన్యాసిని వేషం ధరించింది. ముఖానికి ముసుగు వేసుకున్నది, మెడ నిండా కట్టెడు తావళాలు వేసుకున్నది, చేతిలో సూఫీ బిచ్చగాళ్ళ జెండా పట్టుకుని ఆమె ఇంటినుంచి బయలుదేరింది.

బగ్దాద్‌లో ఉండే గొప్పవారిలో ఒకడు ఖలీఫా రక్షకభట నాయకుడు, ముస్తఫా. ఆయనకు పెద్దజీతం, బ్రహ్మాండమైన చక్కని ఇంటికి గంధపు చెక్కతో చేసిన తలుపులూ, వెండి తాళాలూ ఉండేవి. ఇన్ని ఐశ్వర్యాలకు తోడు ముస్తఫా భార్య చాలా చిన్నది, చక్కనిచుక్క. ఆమె పేరు ఖాతూన్. ముస్తఫాకు భార్య అంటే ప్రాణం. అందుకనే, ఆమెవల్ల తనకు సంతానం కలగకపోయినా, ఆయన మరొక భార్యను చేసుకోలేదు. సాటి అధికారులు దివాణానికి తమ కొడుకులను తెస్తుంటే చూసి ఆయన లోలోన కుమిలిపోయేవాడు.

ఖాతూన్‌కూడా తనకు పిల్లలు కలగలేదని విచారించేది. తన భర్త పిల్లలకోసం వాచిపోతున్నాడని ఆమెకు తెలుసు. పిల్లలు కలిగేటందు కామె యెన్నో ప్రక్రియలు చేసింది, మందులు సేవించింది. ప్రయోజనం మాత్రం లేకపోయింది.

మారువేషంలో, "అల్లా, అల్లా!" అని కేకలు వేస్తూ వీధులవెంట తిరుగుతున్న దిలైలా, ముస్తఫా ఇంటి సమీపానికి వచ్చి తల ఎత్తి చూసేసరికి మేడమీది కిటికీలో

ఖాతూన్ కనిపించింది. ఆమె అంతులేని ఆభరణాలు ధరించి కొత్త పెళ్ళికూతురు లాగా వెలిగిపోతున్నది. "ఈ పిల్లను తీసుకుపోయి ఆ నగలన్నీ కాజెయ్యకపోతే నా ప్రజ్ఞ ఏమిటి?" అనుకున్నది దిలైలా.

దిలైలాను చూడగానే ఖాతూన్‌కుకూడా ఆశ పుట్టుకొచ్చింది. ఈ సూఫీ సన్యాసిని అనుగ్రహం సంపాదిస్తేతనకేమైనా సంతానం కలగవచ్చుననుకుని, ఆమెను పిలుచుకు రావటానికి ఖాతూన్ దాసీని పంపింది.

దిలైలా పైకి రాగానే ఖాతూన్ ఆమె పాదాలమీద పడి తన విచారాన్ని వెలిబుచ్చింది. అంతా విని దిలైలా, "ఇదొక పెద్ద సమస్య కాదు. ఈ నగరంలోనే సంతాన సాధు వొకాయన ఉన్నాడు. ఆయనను ఒక్కసారి చూస్తివా, నీ కోరిక తీరే ఉపాయం చెబుతాడు," అన్నది.

ఖాతూన్ విచారంగా, "నే నెన్నడూ, పుణ్యాలకూ పురుళ్లకుకూడా, ఇల్లుదాటి వెళ్ళినదాన్నికాను," అన్నది.

"అయితే ఇప్పుడే నావెంట వచ్చెయ్యి. నిన్నా సాధువుదగ్గిరికి తీసుకుపోతాను. నీ భర్త తిరిగి వచ్చేలోగా నువు మళ్ళీ ఇంటికి చేరుకోవచ్చు," అన్నది దిలైలా.

తన కోరిక ఫలిస్తుందన్న ఆనందంతో ఖాతూన్ తనకుగల మిగిలిన నగలుకూడా





ధరించి దిలైలా వెంట బయలు దేరింది. వారు కొంతదూరం వెళ్ళేసరికి సిద్దీ మొహసిన్ అనేవాడి దుకాణం వచ్చింది. ఈ దుకాణదారు యువకుడు. అతనికి ఇంకా పెళ్ళికాలేదు. అతన్ని చూడగానే దిలైలాకు ఒక ఆలోచన తట్టింది. ఆమె ఖాతూన్‌ను బయటి అరుగుమీద కూచోబెట్టి మొహసిన్ దుకాణంలోకి వెళ్ళింది.

"ఆ కనిపించే అందగత్తె నా కూతురు. దానికి పెళ్ళియీడు వచ్చింది. నీవంటి బుద్ధిమంతుణ్ణి చూసి పెళ్లిచేద్దామని వుంది. దాని తండ్రి వర్తకంచేసి చాలా సంపాదించాడుగనక నీకేమీ లోటు వుండబోదు.



బోలెడంత కట్నమిస్తాను. కావలిస్తే ఇటువంటి దుకాణాలు మరి రెండు పెట్టుకోవచ్చు," అన్నది దిలైలా మొహసిన్‌తో.

మొహసిన్ పరమానందభరితుడై, "పెళ్లి ఎప్పుడు ఖరారు చేసుకుందాం?" అని అడిగాడు. తనవెంట వస్తే ఇప్పుడే ఖరారు చేసుకోవచ్చు నన్నది దిలైలా. మొహసిన్ ఒక వెయ్యి దీనారాల సంచికట్టు చంకన పెట్టుకుని బయలుదేరాడు.

దిలైలా ఖాతూన్‌నూ, మొహసిన్‌నూ వెంటపెట్టుకుని దారిన పోతూండగా హజ్ ముహమ్మద్ అనే కలంకారీవాడి దుకాణం వచ్చింది. తనవెంట వున్న యిద్దరినీ దూరంగా నిలబెట్టి, దిలైలా లోపలికి వెళ్లి, "అయ్యా, ఆ కనిపించే యిద్దరూ నా కొడుకూ, కూతురూనూ. మా ఇల్లు మీద పడేటట్టుగా ఉంటే మరమ్మతు ప్రారంభించాం. మీ ఎరికను ఖాళీ ఇళ్ళేమైనా ఉన్నాయా? నాలుగు రోజులు మేం ఉండదలిచాం," అని కలంకారీతో అన్నది.

అతను ఆలోచించి, "మా యింటి పైభాగం ఖాళీగానే వుంది. కింద నేనుంటున్నాను. తరుణంలో నీలిమందు అమ్మ వచ్చే వారుండటానికి మేడమీది భాగం ఖాళీగా ఉంచాను. నాలుగురోజులు మీకు





కావలిస్తే వాడుకోండి. ఇవిగో తాళపు చెవులు," అన్నాడు.

దిలైలా మిగిలినవాళ్లను వెంటబెట్టుకుని హజ్ ముహమ్మద్ ఇంటికి వెళ్ళి కింది భాగం తెరిచి, లోపలికి వెళ్ళమని మొహసినుకు సైగచేసింది. తరవాత ఆమె ఖాతూన్‌తో సహా పైకి వెళ్ళి, "అమ్మాయీ, నేను చెప్పిన సాధువు ఈ మేడ కింది భాగంలోనే ఉంటాడు. నేను వెళ్ళి, అయనతో ని విషయం చెప్పి ఇప్పుడే వస్తాను. ఈలోపల నువ్వు నీ నగలన్నీ తీసి భద్రంగా మూటగట్టి ఆ సాధు దర్శనం చేసుకోవటానికి సిద్ధంగా వుండు. ఆయన దగ్గిరికి నగలతో వెళ్ళటం మహాపరాధం!" అని కిందికి వెళ్ళిపోయింది.

మొహసిన్ ఆమెను చూడగానే, "ఏమిటి, పెళ్లి ఖరారు అనుకుందామా?" అన్నాడు.

దిలైలా వగల ఏడుపులు ఏడుస్తూ, "నేనేంచేసేది, నాయనా? ఓర్చలేని దుర్మార్గులు పిల్ల మనసు కాస్తా విరిచేశారు. నీకు తామర వున్నదనీ, బొల్లి వున్నదనీ దానితో చాడీలు చెప్పారు. అది ససేమిరా నిన్ను పెళ్లాడనంటున్నది. నీ చొక్కా విప్పదీసి కూచో. దాన్ని తీసుకువచ్చి చూపించి పెళ్ళికి ఒప్పిస్తాను. నీ సంచీ



చొక్కా నాకిచ్చెయ్యి. పైన భద్రంగా దాస్తాను," అన్నది.

మొహసిన్ తన దీనారాల సంచీ, చొక్కా ఆమె చేతికిచ్చాడు. ఆమె మళ్ళీ పైకివెళ్లి, ఖాతూన్‌తో, "నీకోసం సాధువు యెదురు చూస్తున్నాడు. నీ పంట పండిందిలే. కిందికిపద, నీ నగలమూట దాచి ఇప్పుడే వస్తున్నాను," అన్నది. ఖాతూన్ కిందికి దిగి లోపలికి వెళ్ళింది. దిలైలా ఆమె వెనకే రెండు మూటలూ పట్టుకుని దిగి నేరుగా వీధిలోకి వెళ్ళిపోయింది.

ఖాతూన్ కింది అంతస్థులోకి వెళ్ళి చూసింది. ఆమెకు సాధువు ఎక్కడా కని

పించలేదుగాని చొక్కా లేకుండా మొహసిన్ కనిపించి, "చూసుకో, నా వంటిమీద ఒక మచ్చఅయినా ఉన్నదేమో!" అన్నాడు. ఖాతూన్ బెదిరిపోయి మళ్ళీ మేడమీదికి పరిగెత్తి తలుపుమూసి గడియవేసుకున్నది.

సూఫీ సన్యాసిని జాడగాని, తన నగల మూట జాడగాని ఆమెకు కనిపించలేదు.

ఈలోగా దిలైలా తాను కాజేసిన మూటలను ఒక ఎరిగున్న దుకాణంలో వుంచి కలంకారీ దుకాణానికి వెళ్ళింది.

"బాబూ, ఇల్లు చాలా సౌఖ్యంగా అమరింది. మీరు చాలా పుణ్యం కట్టుకున్నారు. పిల్లలిద్దరూ ఆకలి అంటున్నారు కాస్త వాళ్లకేమైనా పట్టుకుపోతారా? ఇదుగో ఒక దీనారం పుచ్చుకోండి. మీరుకూడా వాళ్ళకు తోడుగా ఫలహారం చెయ్యండి. నేనింటికిపోయి సామాను పట్టించుకొస్తాను," అన్నది దిలైలా.

హజ్ ముహమ్మద్ తన దుకాణాన్ని ఒక పనివాడికి వప్పగించి బయలుదేరాడు. దిలైలాకూడా వెళ్ళి తాను దాచివుంచిన మూటలు తీసుకుని కొంతసేపటికి తిరిగి వచ్చింది. ఆమె పనివాడితో, "మీ యజమానిగారు రొట్టెల దుకాణంలో వున్నారు. నిన్ను వెంటనే రమ్మన్నారు. వెళ్ళు నాయనా. నువు తిరిగి వచ్చేదాకా దుకా



ఖం నేను చూస్తూంటాలే!" అన్నది.
పనివాడు బయటికి అడుగుపెట్టాడు.

దిలైలా దుకాణంలో ఉన్న సామానులో ఎత్తటానికి వీలైనదల్లా ఏరి ఒక పక్క పెట్టింది. దుకాణం ముందుగా మోతగాడిదను తోలుకుంటూ ఒక కుర్రాడు వెళుతుంటే వాణ్ణి పిలిచి, "నీకి దుకాణదారు తెలుసుగా, బాబూ? వాడు నా కొడుకే. మా వాణ్ణి అప్పులవాళ్ళు పట్టుకుపోయారు. ఈ సామానంతా ఊళ్ళోవాళ్లది. వాళ్ళకి తిరిగి ఇచ్చెయ్యాలి. దీన్ని నీ గాడిదమీదవేసి నా వెంట పంపిస్తావా? ఇదుగో ఒక దీనారం పుచ్చుకో. నేను మళ్లీ తిరిగివచ్చేలోగా నీలి ద్రావకం సీసాలూ, కర్రసామానూ పగలగొట్టెయ్యి, లేకపోతే జప్తుచేస్తారు," అన్నది.

గాడిదను తోలే కుర్రవాడు సరేనన్నాడు. దిలైలా సామానంతా గాడిదమీద వేసుకుని తిరిగిచూడకుండా ఇంటికి వెళ్ళిపోయింది. తల్లిని చూడగానే జీనాబ్, "అమ్మా, ఏం చేసుకొచ్చావు?" అని ఆత్రంగా అడిగింది.

"నలుగురి కళ్ళలో దుమ్ముకొట్టాను. ఇవి ఒక అధికారిభార్య నగలు. ఇవి ఒక దుకాణదారు సంచీ, చొక్కా. ఇవన్నీ ఒక నీలివర్తకుడి సరుకులు. ఈగాడిద నాలుగో వాడిది!" అన్నది దిలైలా గర్వంగా.



"బాగానే ఉందిగాని, అమ్మా, నువ్వింక ఇల్లు కదలటానికి లేదు. వాళ్లు నలుగురూ నీకోసం చూస్తూంటారు!" అన్నది జీనాబ్.

"పిచ్చిదానా, ఇంకా అవగింజలో అర భాగం కాలేదు," అన్నది దిలైలా.

కలంకారీవాడు రొట్టెల దుకాణంలో రొట్టెలూ, కూరా కొంటూండగా పనివాడు వచ్చి, ఎందుకు పిలిచారని అడిగాడు. కలంకారీకి అనుమానంవేసి దుకాణానికి వచ్చి చూసేసరికి గాడిదగల కుర్రవాడు దుకాణం ధ్వంసంచేస్తూ కనిపించాడు.

"ఇదేం పనిరా, నిన్ను పగలగొయ్యా!" అన్నాడు కలంకారీ.

"మిమ్మల్ని బాకీదార్లు వదిలిపెట్టారు గద!" అన్నాడు గాడిదగల కుర్రవాడు.

వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థంచేసుకునే టందుకు చాలాసేపు పట్టింది. చివరకు, "ఆ ముసలిదెక్కడ?" అని కలంకారీవాడూ, "నా గాడిదమాటేమిటి?" అని గాడిద గల కుర్రవాడూ లబలబ లాడసాగారు. చుట్టూ చాలామంది పోగయారు. అందరూ కలిసి కలంకారీ ఇంటికి వెళ్ళారు.

కలంకారీవాడు కిందిభాగం తలుపుతట్టే సరికి చొక్కాలేకుండా వచ్చి మొహసిన్ తలుపు తెరిచాడు. "దొంగ గాడిదా, మీ అమ్మ ఎక్కడ?" అని అరిచాడు కలంకారీ. "మా అమ్మపోయి ఎంతకాలమాయె!" అన్నాడు మొహసిన్. వాళ్లిద్దరూ ఒకరినొకరు అర్థంచేసుకోవటానికి మరికొంతకాలం పట్టింది. చివరకు మొహసిన్, "ఆ ముసలిది తన కూతుర్ని నాకిస్తానని పిలుచుకు వచ్చింది. వాళ్లు పైనే ఉన్నారు!" అన్నాడు.

కలంకారీ మెట్లెక్కి పైకివెళ్ళి తలుపు తట్టాడు. ఖాతూన్ వచ్చి తలుపు తీసింది. "మీ అమ్మ ఎక్కడ?" అని అడిగాడు వర్తకుడు. "మా అమ్మపోయి ఎంతకాలమాయె!" అన్నది ఖాతూన్.

నలుగురూ చాలాసేపు కూడబలుక్కున్న మీదట మోసం ఎట్లా జరిగిపోయిందీ తెలియ వచ్చింది. ఖాతూన్‌ను ఆమె ఇంటికి పంపేసి మిగిలిన ముగ్గురూ నగర రక్షకుడైన ఖాలిద్ వద్దకు వెళ్లి జరిగినసంగతి చెప్పుకున్నారు.

ఖాలిద్ ఆశ్చర్యంతో వారుచెప్పిన విషయాలు విని, "ఈ మహానగరంలో ఉండే ముసలమ్మలలో మిమ్మల్ని మోసంచేసిన దాన్ని ఎట్లా పట్టుకోను? మీరే ఎట్లాగైనా శ్రమపడి అవిణ్ణి పట్టుకుంటే నేను తప్పక శిక్షిస్తాను," అన్నాడు. గత్యంతరం లేక మోసపోయిన ముగ్గురూ మూడు వైపులా ముసలిదాన్ని వెతుకుతూ బయలుదేరారు.

(ఇంకా వుంది)





# లెక్కలు రాని రాజు

పూర్వం మగధదేశాన్ని చతురంగవీరుడనే రాజు పాలిస్తూండేవాడు. ఆయన చదరంగం ఆటలో చాలా పేరుమోసినవాడు. ఎంతో నిపుణులైన ఆటగాళ్ళు సయితం ఆయనతో చదరంగమాడి ఓడిపోయారు.

నిత్యమూ తనతో ఆడటానికి వచ్చేవాళ్లతో వేగలేక రాజు, "నాతో చదరంగంఆడి ఓడిపోయిన వారికి శిరచ్ఛేదం శిక్ష విధించబడుతుంది," అని ప్రకటనచేశాడు.

ఈ ప్రకటన విన్నతరవాత ఆటగాళ్ళు తండోపతండాలుగా వచ్చి రాజును ఆటకు పిలవటం మానేశారు. ఎప్పుడన్నా ఒకరూ, ఇద్దరూ వచ్చినా రాజుగారు వారికి మరణశిక్షగురించి చెప్పి పంపించేవాడు. కాదు కూడదని ఎవరైనా పట్టుబట్టి ఆటకు కూచుంటే రాజు వారిని ఆటలో ఓడించి, తన ప్రతిజ్ఞ నిలబెట్టుకునేటందుకు వారికి శిరచ్ఛేదం చేయించాడు.

ఈ విధంగా ఒకరిద్దరి తలలు తెగిపోయాక రాజుగారిని చదరంగం ఆటకు కూర్చోమన్నవారే లేకుండాపోయారు. మంచి ఆటగాళ్ళెవరూ రాని కారణంచేత రాజుకుకూడా చదరంగంతో ఋణం తీరినట్టయిపోయింది.

ఆకాలంలోనే కావేరీతీరాన ఒక గొప్ప శాస్త్రజ్ఞుడుండేవాడు. ఆయనకు చదరంగం ఆటలో మంచి నైపుణ్యంఉంది. ఎవరైనా చదరంగం ఆడుతూంటే ఆయన ఆటమధ్యలో, "ఇన్ని ఎత్తులలో నల్లరాజును కట్టించవచ్చు," అని చెప్పేవాడు. అవకాశమిస్తే ఆట కట్టించి చూపేవాడుకూడా.

ఈ బ్రాహ్మడికి మగధదేశపు రాజు వృత్తాంతం తెలిసింది. ఆయనకు రాజుమీద ఆగ్రహం కలిగింది. ఆ రాజుకు తాను గెలుస్తానని అంత గర్వందేనికి ? చదరంగం ఆటయొక్క రక్తి ఆడటంలో ఉందిగాని

పి. రాజేశ్వరి



గెలవటంలోనూ ఓడటంలోనూ లేదు. చదరంగం ఆట అన్నతరవాత ఒక గెలిచేవాడుంటాడు, ఒక ఓడేవాడూ ఉంటాడు. ఓడినంతమాత్రాన ఈ రాజు శిరచ్ఛేదం చేయిస్తాడా? ఆయన ఎటువంటి ఆటగాడు?

మగధరాజుకు ఎట్లాగైనా బుద్ధిచెప్పాలని ఈ బ్రాహ్మడికి అనిపించింది. ఆయన కాలినడకను ప్రయాణమై కొంతకాలానికి మగధ చేరాడు. రాజదర్శనం సంపాదించాడు.

"మహారాజా, నేను కావేరీతీరం వాణ్ణి. తమరు చదరంగం ఆటలో సాటిలేని నిపుణులని విని తమ ఆటచూసే అభిలాషతో ఇంతదూరం వచ్చాను" అన్నాడు బ్రాహ్మడు.

"నిజమేనయ్యా! నాకూ చదరంగం ఆడాలనే ఉంది. కాని నాతో ఆడేవాడేడీ? నాతో ఆడి ఓడిపోయినవాడికి శిరచ్ఛేదం శిక్ష విధిస్తానని చాటింపు వేసి ఉన్నాను. అందుచేత నాతో ఎవరూ ఆడరు!" అన్నాడు రాజు.

బ్రాహ్మడు కొంచెం ఆలోచించి, "అలా అయితే, నేనే తమతో ఆడతాను," అన్నాడు.

"పిచ్చి బ్రాహ్మడా! నిష్కారణంగా తల పోతుంది! ఓడితే శిరచ్ఛేదానికి సిద్ధమేనా?" అని అడిగాడు రాజు.

"ఆ ప్రశ్నకు సమాధానం చెప్పేముందు నాకుగల చిన్న సందేహం ఒకటి తమరు తీర్చాలి," అన్నాడు బ్రాహ్మడు.

"ఏమిటి నీ సందేహం?" అన్నాడు రాజు.

"నేను ఆటలో ఓడితే నాతల తీసేస్తారు. కాని దారితప్పి నేను ఆటలో గెలిస్తే తమరు, నాకేమిస్తారు?" అన్నాడు బ్రాహ్మడు.

"నన్ను చదరంగంలో గెలిచినవాడు ఏది అడిగినా ఇస్తాను. ఏంకావాలి?" అన్నాడు రాజు.

"నేను గెలిస్తే ధాన్యం ఇప్పించండి. చదరంగంబల్లలో ఉండే గళ్లలో, ఒక గడి కన్న మరొక గడికి రెట్టింపు గింజలచొప్పున పెంచుతూ, 64 గళ్లకూ ధాన్యం ఇప్పిం

చండి. అంతకన్న నేను కోరేది లేదు," అన్నాడు బ్రాహ్మడు.

"పిచ్చిబ్రాహ్మడా! నువు కోరేది ఇంత మాత్రమేనా? గెలుస్తావన్న ధైర్యం నీకు స్పష్టులేదు!" అన్నాడు రాజు.

"చిత్తం, ధైర్యం ఉండటమేకాదు; ఒక్క ఆట ఆడి మిమ్మల్ని రెండుసార్లు ఓడిస్తాను!" అన్నాడు బ్రాహ్మడు.

"అంటే?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"అది ఆట ఆడినాక మీకే తెలుస్తుంది," అన్నాడు బ్రాహ్మడు.

మర్నాడు చదరంగం పందెం ఏర్పాటు చేశారు. ఆట చూడటానికి జనం తండోప తండాలుగా వచ్చారు. బ్రాహ్మడికి అయుపు మూడిందని అందరూ అనుకున్నారు. రాజు చాలా పట్టుదలగా ఆడాడు. కాని చివరకు బ్రాహ్మడే రాజు ఆటకట్టించాడు.

"నేను ఓడిపోయాను! నువు నిజంగా గొప్ప ఆటగాడివే. కాని నన్ను రెండుసార్లు ఓడిస్తానన్నావు. ఒకసారే ఓడించావు. నా రెండో ఓటమి ఏమిటి?" అని రాజు అడిగాడు.

"నా బహుమానం నాకు దయచేయించండి. తరవాత మీ రెండో ఓటమి సంగతి మాట్లాడదాం," అన్నాడు బ్రాహ్మడు.



రాజు ధాన్యం బస్తాలు తెమ్మనమని భటులకు అజ్ఞాపించాడు.

"నాకు ఎంత ధాన్యం ఇవ్వవలిసి వస్తుందో ముందు అంచనా వేయండి. ఆ అంచనాప్రకారం బస్తాలు తెప్పించవచ్చు," అన్నాడు బ్రాహ్మడు.

రాజు గణితప్రవీణులను పిలిపించాడు.

"మొదటి గడిలో ఎన్నిగింజలు పెట్టమన్నారు?" అని అడిగారు వారు.

"ఒక్కగింజ పెట్టండి చాలు!" అన్నాడు బ్రాహ్మడు. రాజు బ్రాహ్మడి అల్ప సంతోషానికి నవ్వాడు. మొదటి గడిలో ఒకగింజా, రెండో గడిలో రెండుగింజలూ, మూడోగడిలో

నాలుగుగింజలూ—ఈవిధంగా 64 గడులకూ అయే గింజల సంఖ్య గుణించి ఈ కింది సంఖ్య రాజుగారికి చూపారు:

18446744073709551615

రాజు నిర్ఘాంతపోయాడు.

"అవి ఎన్నిపుట్ల ధాన్యానికి సమానమో లెక్కవెయ్యండి," అన్నాడు రాజు. గణిత శాస్త్రజ్ఞులు మానికకు ఎన్నిగింజలో కొలిచి, పుట్టికి ఎన్నిగింజలో గుణించి, మగధ రాజ్యంలో ఏటా ఎన్నిపుట్లు పండుతాయో ఆరాతీసి చివరకు రాజుతో, "మహారాజా, మనరాజ్యంలో రెండు లక్షల ఏళ్లపాటు పండే ధాన్యం మీరు బ్రాహ్మడికి ఇవ్వవలిసి ఉంటుంది," అని చెప్పారు.

రాజు ఆశ్చర్యానికి మేరలేదు.

"ఔర పిడుగా! ఇదేనా నా రెండో ఓటమి?" అన్నాడు రాజు.

"చిత్తం మహారాజా! నేను కోరినది చాలా తక్కువనుకున్నారు. మీరు గెలిచి ఉంటే నేను సులువుగా నాతల ఇచ్చి ఉందును. నేను గెలిచాను కాని నేనడిగినది తమరు ఎలాకూడా ఇవ్వలేరు," అన్నాడు బ్రాహ్మడు నవ్వుతూ.

"ఆటలో గెలిచావు గనక సరిపోయింది. ఓడిపోతే ఏమైఉండును. ఇంత సాహసం ఎందుకు చేశావు?" అన్నాడు రాజు.

"నేను కోరినప్రకారం గింజలు ఇవ్వటానికి ఎప్పుడైతే మీరు సమ్మతించారో, అప్పుడే మీకు గణితజ్ఞానం లేదని తెలుసుకున్నాను. మీరు ఓడిపోతారని రూఢిచేసుకుని పందానికి సమ్మతించాను. నాపాటి గణితజ్ఞానం మీకుంటే నేను మీతో చదరంగం ఆడనేఆడను," అన్నాడు బ్రాహ్మడు.

రాజు బ్రాహ్మడి జ్ఞానానికి చాలా సంతోషించి ఆయనకు బోలెడంత ధనం ఇచ్చి పంపేశాడు. అదిమొదలు రాజు గర్వం మాని ఆడటానికి వచ్చిన వారందరితోనూ చదరంగం ఆడసాగాడు.



# తినందే రుచి తెలీదు

ఒక ధనికుడికి ఒక మామిడితోపు ఉండేది. అందులో అనేక మేలురకాల మామిడిపళ్లు పండేవి.

ఒక వేసవిలో ఒకనాడు ధనికుడికి మామిడిపళ్లు తినాలనిపించి, కొత్తగా పనిలో పెట్టుకున్న నౌకరును ఒకణ్ణి పిలిచి, "ఒరే, నువ్వు మనతోటకు వెళ్లి మంచి, తియ్యని మామిడిపళ్లు కోసుకుని పట్టుకురా! తియ్యటి పళ్ళుమాత్రమే పట్టుకురా, సుమా!" అన్నాడు.

నౌకరు తోటకు వెళ్లి పండుగా కనిపించినవి కొన్ని కోశాడు. తరవాత అన్నిటినీ కొరికి చూసి, తియ్యగా ఉన్నవిమాత్రం మూటగట్టుకుని, మిగిలినవి వదిలేసి యజమానివద్దకు తిరిగివచ్చాడు.

వాటిని చూసి యజమాని, "ఇవన్నీ కొరికిఉన్నాయేమిరా?" అని అడిగాడు.

"నేనే కొరికాను, బాబూ! తినందే రుచి ఎట్లా తెలుస్తుందండి?" అన్నాడు నౌకరు అమాయకంగా.

---

# మనిషిని పట్టిన చేప!



# అతిథినిబట్టి ఆతిథ్యం

ఒకనాడొక ఎరిగున్నవాడు గోహాకు ఒక కోడిని దానంచేశాడు. గోహా ఆ కోడిని వండించి అతన్నికూడా భోజనానికి ఆహ్వానించాడు.

భోజనాలు ముగిసిన కొద్దిసేపటికి ఎవరో వచ్చి, తలుపు తట్టి, "భోజనం పెడతారా?" అని అడిగారు.

గోహా తలుపుతీసి, "ఎవరు, నాయనా?" అని అడిగాడు.

"మీకు కోడి ఇచ్చినాయన పక్కయింటివాణ్ణి!" అన్నాడు వచ్చిన మనిషి.

గోహా సంతోషంగా అతనికి భోజనం పెట్టి పంపాడు. మరికాస్సేపటికి ఇంకెవరో తలుపుతట్టి, "భోజనం పెడతారా?" అని అడిగాడు.

గోహా తలుపు తెరిచి, "నువ్వెవరు, నాయనా?" అన్నాడు.

"మీకు కోడి ఇచ్చినవాడి స్నేహితుడి స్నేహితుణ్ణి!" అన్నాడు వచ్చినవాడు.

గోహా అతన్ని పిలిచి కూచోబెట్టి, ఒక పళ్లెంలో జిడ్డు తేలుతున్న నీరు తెచ్చి అతని ముందు పెట్టి, "కానియ్యి!" అన్నాడు.

"ఇదేమిటి?" అన్నాడు కొత్తవాడు.

"ఇదా? ఇది నీ స్నేహితుడి స్నేహితుడిచ్చిన కోడిని ఉడకబెట్టిన నీరు తాలూకు చెల్లెలుకు చెల్లెలు!" అన్నాడు గోహా. వచ్చినవాడు తలవంచుకుని వెళ్లిపోయాడు,



# పురాతన జంతువులు

సరీసృపాలయుగం అంతం కాగానే సస్తన (పిల్లలకు పాలిచ్చే) ప్రాణులయుగం ప్రారంభమయింది. దయ్యపు బల్లులు నేలమీదా, నీటిలోనూ, గాలిలోనూ, తమ ఏలుబడిసాగించే కాలంలోనే, ఈనాటి ఎలుకలూ, చుంచులూ ఉండే ప్రమాణంలో సస్తన జంతువులు అవతరించాయి.

తమస్థానాన్ని ఈ అల్పప్రాణుల సంతతి ఆక్రమించబోతుందని దయ్యపు బల్లులు కలలో కూడా భావించి ఉండవు. కాని నిజానికి ఈ సస్తన జంతువులు దయ్యపు బల్లులకంటె అనేక విధాలుగా అభివృద్ధి చెందినటువంటివి.

1. సరీసృపాలు శీతలరక్త జంతువులు, కాని సస్తన జంతువులు ఉష్ణరక్త జంతువులు. అంటే, వాతావరణం బాగా చల్లబడిపోయినా వాటిరక్తం వేడిగానే ఉంటుంది. సరీసృపాల యుగం ఆఖరయేకాలానికి ప్రపంచంలో అనేక ప్రాంతాల తీవ్రమైన చల్లదనం ఏర్పడింది. ఆ చలికి శీతలరక్త జంతువులైన సరీసృపాలు పోయి, ఉష్ణరక్తంగల సస్తన జంతువులు దక్కాయి. అదీగాక, వీటి శరీరాలమీద రోమాలుండటంచేత ఇవి చలికి తట్టుకోగలిగాయి.

2. సరీసృపాలకు వేగంగా కదిలే శక్తి లేదు. అలాటి నేర్పు ఉండటంచేత సస్తన జంతువులు, తమ శత్రువులైన సరీసృపాలనుంచి పారిపోయి సులువుగా ఆత్మరక్షణ చేసుకోగలిగాయి.

3. సరీసృపాలు గుడ్లుపెట్టాక వాటి బాధ్యత ఏమీ తీసుకునేవికావు. కాని సస్తన జంతువులు తమ పిల్లలను తమ గర్భకోశంలోనే పొదిగి, పుట్టాక వాటికి తమ పాలిచ్చి పెంచి, అవి పెద్దవయేదాకా సంరక్షించాయి. ఇందువల్ల వాటి సంతతి పెరిగింది.

4. సరీసృపాలకూ సస్తన ప్రాణులకూ గల ముఖ్యమైన భేదమేమంటే, వాటి శరీరాలతో పోల్చితే సరీసృపాల మెదడుకన్న సస్తన జంతువుల మెదడు చాలా పెద్దది. సరీసృపాలకు దాదాపు బుద్ధేలేదని చెప్పవచ్చు; సస్తనప్రాణులు తెలివైనవి.

సస్తన ప్రాణులయుగంలో ఈ తరగతికిచెందిన జాతులు అనేక వేలు ఉత్పన్నమయాయి. 6 కోట్ల ఏళ్లక్రితం ప్రారంభమై ఈ యుగం ఇంకా నడుస్తూనే ఉన్నది. సస్తన ప్రాణులలో కొన్ని బ్రహ్మాండమైన ప్రమాణంకలవి పుట్టాయి, వీటినిగురించి మరొకసారి తెలుసుకుందాం.



# భూ గో ళ ం—1

మనం నివసించే భూమియొక్క వైశాల్యం 19,69,50,000 చదరపు మైళ్ళు. ఇందులో 5,75,10,000 చ.మైళ్ళు భూమి; మిగిలిన 13,94,40,000 చ.మైళ్ళు నీరు.

* భూభాగంలో 170 లక్షల చ.మైళ్ళు ఆసియా; 115 లక్షల చ.మైళ్ళు ఆఫ్రికా; 37 న్నర లక్షల చ.మైళ్ళు యూరప్; 80 లక్షల చ.మైళ్ళు ఉత్తర అమెరికా; 68 లక్షల చ.మైళ్ళు దక్షిణ అమెరికా; 62 లక్షల 5వేల చ.మైళ్ళు దక్షిణ ధృవఖండం; ఆస్ట్రేలియా, ఇండోనీషియా వగైరాలతో కూడిన ఓషియానియా 42 లక్షల 55 వేల చ.మైళ్ళు.

* జలభాగంలో పెసిఫిక్ మహాసముద్రం వైశాల్యం 686 లక్షల 34 వేల చ.మైళ్ళు; అట్లాంటిక్ 413 లక్షల 22 వేల చ.మైళ్ళు; హిందూ మహాసముద్రం 283 లక్షల 50 వేల చ.మైళ్ళు; దక్షిణధృవ సముద్రం 75 లక్షల చ.మైళ్ళు; ఉత్తరధృవ సముద్రం 54 లక్షల 40 వేల చ.మైళ్ళు.

* అన్ని సముద్రాలలోకి ఎక్కువ లోతు పెసిఫిక్ సముద్రంలో వున్నది, అది 35,600 అడుగులు; అట్లాంటిక్‌లో ఎక్కువ లోతైన ప్రాంతం 30,246 అడుగులు; హిందూ మహా సముద్రంలో ఎక్కువ లోతు 22,968 అడుగులు; ఉత్తరధృవ సముద్రంలో 17,850 అడుగులు; దక్షిణధృవ సముద్రంలో ఎక్కువ లోతు 14,274 అడుగులు.

* 2 వేల మైళ్లు, అంతకు మించిన నిడివిగల నదులు భూమిపై 17 ఉన్నాయి. అన్నిటిలోకి ఎక్కువ నిడివిగల నైల్ నది 4,160 మైళ్లు. అమెజాన్ నది 3,900 మైళ్లు; యాంగ్‌ట్సే నది 3,100 మైళ్ళు; అబ్ నది 2,500 మైళ్లు; మిసిసిపీ నది 2,470 మైళ్లు; మిస్సోరీ నది 2,432 మైళ్ళు; వోల్గా నది 2,290 మైళ్లు.

* ప్రపంచంలో గల అత్యున్నత శిఖరాలలో మొదటి 14 హిమాలయాలలోనే వున్నాయి. వాటన్నిటిలో ఎత్తయినది ఎవరెస్ట్, దాని ఎత్తు 29,141 అడుగులు. మిగిలినవి; గాడ్విన్-ఆస్టెన్ 28,250 అడుగులు; కాంచనగంగ 28,146 అ; మకాలూ 27,790 అ; ధవళగిరి 26,810 అ; నంగపర్వతం 26,660 అ; అన్నపూర్ణ 26,492 అ; గషేర్బ్రం 26,470 అ; గోసాయింతాన్ 26,291 అ; నందాదేవి 25,645 అ; రకపోషి 25,550 అ; నాంచాబర్వా 25,455 అ; కామెట్ 25,447 అ; గుర్లా మాంధాత 25,355 అ.

* ప్రపంచ జనాభా ఉజ్జాయింపుగా 226,44,09,000. ఇందులో సగానికి పైగా— 117,83,41,000 మంది—ఆసియావాసులు. 38 కోట్ల 9 లక్షల 60 వేల మంది యూరప్‌లో, 21,13,85,000 మంది సోవియెట్‌యూనియన్‌లో, 19,26,57,000 మంది ఉత్తర అమెరికాలో, 17,58,69,000 మంది ఆఫ్రికాలో, 10 కోట్ల 14 లక్షల మంది దక్షిణ అమెరికాలో, 237 లక్షల 97 వేల మంది ఆస్ట్రేలియా వగైరా ఇతర ప్రాంతాలలో నివసిస్తున్నారు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రూపులు వేరైనా...

రెండవ ఫోటో : మనమందర మొకటేనే!

పంపినవారు : యస్. వి. రమణ పట్నాయక్, సెంట్రల్ స్టోర్స్, ఖర్గపూరు

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




## దివ్యదృష్టి

స్టేజిమధ్య ఒక మామూలు కుర్చీమీద ఇంద్రజాలికుడి అసిస్టెంటు కూచుని ఉంటుంది. ప్రేక్షకులలో ఒకరు వచ్చి ఆమె కళ్లకు తమ చేతి రుమాలుతోనే గంత కట్టేస్తారు. ఆమె ఏవిధంగానూ తన కళ్లను ఉపయోగించి చూడటానికి వీలులేకుండా ఈగంత కట్టబడుతుంది.

తరువాత ఇంద్రజాలికుడు ప్రేక్షకులతో, తన అసిస్టెంటు కళ్లకు గంతలు కట్టబడినప్పటికీ, దివ్యదృష్టిచేత ఆమె సమస్తమూ చూడగలదని చెబుతాడు. ఈవిధంగా ఉపన్యసించి అతను ప్రేక్షకులమధ్యకు వెళ్లి వారి చేతి రుమాళ్లు 30 దాకా పోగుచేస్తాడు. ఒకరి టోపీ అరువు తీసుకుని దానిలో ఈ చేతి రుమాళ్ళన్నీవేసి బాగా కలిపేస్తాడు. తరువాత టోపీ బల్లమీద ఉంచబడుతుంది.

అనంతరం ఇంద్రజాలికుడు టోపీలో నుంచి ఒక చేతి రుమాలు ఎత్తి కళ్లకు గంతలు కట్టిన స్త్రీ ముఖం ముందు దాన్ని పట్టుకుని, ఆ రుమాలు ఏరంగుగా ఉన్నదని అడుగుతాడు. వెంటనే ఆమె దానిరంగు చెప్పేస్తుంది. ఇంద్రజాలికుడు నీలంరంగు రుమాలుతీస్తే ఆమె చిన్నగొంతుతో "నీ—లం" అని చెప్పేస్తుంది. ఎర్ర రుమాలు ఎత్తితే, "ఎ–రు–పు" అని చెప్పేస్తుంది. ప్రేక్షకులకిది నిజమైన దివ్యదృష్టిలాగే అనిపిస్తుంది.

దీని రహస్యం ఏమంటే—ఇంద్రధనుస్సులో ఏడు రంగులున్నాయి. 1. ఊదా, 2. నీలి, 3. నీలం, 4. ఆకుపచ్చ, 5. పసుపుపచ్చ. 6. నారింజ (లేక వంగపండు రంగు), 7. ఎరుపు. ఈ ఏడింటికీ ఇంద్రజాలికుడు మరి

మూడు రంగులు—తెలుపు, నలుపు, చుక్కలు—చేర్చుతాడు. ఐంద్రజాలికుడికి సహాయపడే అసిస్టెంటుకు ఈ పదింటి క్రమమూ కరతలామలకంగా తెలిసి ఉండాలి.

ఈ ట్రిక్కు చెయ్యటంలో ఐంద్రజాలికుడి అసిస్టెంటు మరొకడుకూడా సాయపడితేగాని "దివ్యదృష్టి" సరిగా పనిచేయదు. ఈ రెండవ అసిస్టెంటు ప్రేక్షకులకు కనిపించకుండా పక్క తెరల వెనక నిలబడివుంటాడు. అతనికి స్టేజిమీద జరిగేదంతా స్పష్టంగా కనిపిస్తూనే ఉంటుంది. ఐంద్రజాలికుడు ఒక చేతిరుమాలు పైకి ఎత్తగానే ఇతను దాని రంగు తాను చూసి, సంకేతాలద్వారా, స్టేజిమీద వున్న అసిస్టెంటుకు తెలియజేస్తాడు. ఇందుకుగాను ఒక సన్నని సిల్కుదారం ఉపయోగించపడుతుంది. దాని ఒక చివర స్టేజిమీద ఉన్న స్త్రీ చిటికెన వేలికి కట్టివుంటుంది. రెండవ చివర నేపథ్యంలో వుండే అసిస్టెంటు చేతిలో ఉంటుంది. (బొమ్మ చూడండి.) తాడును ఒక్కసారి లాగితే ఊదా రంగన్నమాట. రెండుసార్లు లాగితే



నీలి రంగు, మూడుసార్లు లాగితే నీలం రంగు, ఏడుసార్లు లాగితే ఎరుపురంగు; ఇదే సంకేతం.

ఇటువంటి సంకేతాల సహాయంతో ఇంకా గొప్ప ట్రిక్కులుకూడా చేసి ప్రేక్షకులను ఆశ్చర్యపరచవచ్చు. చాలామంది ఐంద్రజాలికులు తమ అసిస్టెంట్లచేత కరెన్సీనోట్ల మీది సంఖ్యలూ, నల్లబల్లమీద వేసిన చిన్న చిన్న లెక్కలూ విజయవంతంగా చెప్పించటం నేను చూశాను.

[పాఠకులు, యీగారడీని గురించి నలహాలు పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ, ప్రొఫెసరుగారి పేర ఉత్తరం రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయాలి.

వారి అడ్రసు యిది:- ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888 కలకత్తా-12.]

# అట్టచివరి బొమ్మ

ఒకరోజు రాజు - 1

హారూన్ అల్‌రషీద్ ఖలీఫాగా వున్న కాలంలో బగ్దాద్‌లో ఒక వింత బ్రహ్మచారి ఉండేవాడు. అతని పేరు అబూ అల్ హసన్. అతను తన తల్లితో ఏకాంత జీవితం జీవిస్తూ వుండేవాడు. ఇరుగు పొరుగువా రెవరినీ పలకరించేవాడుకాడు. పరదేశీలను తప్ప తన ఇంటికి భోజనానికి ఆహ్వానించేవాడు కాడు. ఒకసారి ఆతిథ్యం ఇచ్చిన మనిషికి మరొరికసా యిచ్చేవాడుకాడు.



అబూ ప్రతి సాయంకాలమూ నగరం చివర నదిమీద వున్న వంతెనవద్దకు వెళ్లి కాపువేసేవాడు. పరదేశీ ఎవరైనా కనిపిస్తే, అతనికెదురుగా నవ్వుతూ వెళ్లి, "ఈ రాత్రి తమరు మా ఇంట బసచేసి నా ఆతిథ్యం స్వీకరించాలని మనవి," అనేవాడు. ఆ తరవాత అతిథిని తన ఇంటికి తీసుకుపోయి, రాజోపచారాలు జరిపి మృష్టాన్న భోజనం పెట్టి, పడుకోబెట్టేవాడు. మర్నాడు అతిథిని సాగనంపుతూ, "అయ్యా, తమరికి బగ్దాద్‌లో ఎరిగిన ముఖం అంటూ లేనప్పుడు ఆతిథ్యం యిచ్చాను. దేవుడి కొడుకకైనా సరే నా ఆతిథ్యం రెండవసారి లభించదు. కనక మీ దారి మీదీ, నా దారి నాదీ! బగ్దాద్ వీధులలో పొరపాటున మనం కలుసుకోవటం జరిగినా నేను తమరిని గుర్తించి పలకరించబోను. తమరుకూడా దయవుంచి నన్ను పలకరించవద్దు," అని చెప్పేవాడు.

ఒకనాడు సూర్యాస్తమయం వేళ అబూ వంతెనవద్ద నిలబడివుండగా, ధనికుడైన మోసుల్ వర్తకుడిలాగా కనిపిస్తూ ఒక వ్యక్తి అతని వైపు వచ్చాడు. ఆ వర్తకుడి వెనుకగా ఒక అజానుబాహువైన బానిస వున్నాడు. ఆయన ఖలీఫా హారూన్ అల్ రషీదే. ఆయన ఆ విధంగా మారువేషం వేసుకుని నెలకొకసారి నగరం పరీక్షిస్తాడు.

ఈ సంగతి తెలియని అబూ, ఖలీ ఫాను సమీపించి, "ఈ రాత్రి తమరు యింటికి దయచేసి, నా అతిథ్యం స్వీక రించాలని ప్రార్థన," అన్నాడు.

ఖలీఫా మొహమోట పడ్డట్టు కనిపించి, చివరకు సరేనన్నాడు.

అబూ తల్లి రుచిరుచిగా రకరకాల వంటకాలు చేసి ఇద్దరికీ భోజనం పెట్టింది. భోజనాలైనాక అబూ పానీ యాలు తెచ్చి అతిథి ముందు పెట్టాడు.

సంభాషణ మధ్య అబూ తన కథను అతిథికి ఈవిధంగా తెలిపాడు:

"నా పేరు అబూ అల్ హసన్. మా తండ్రి వర్తకుడు. ఆయన నన్ను చాలా కట్టుదిట్టాలతో పెంచటంచేత, ఆయన పోగానే నాకు విచ్చలవిడిగా ఆనందించ బుద్ధి అయింది. ఆ పని ప్రారంభించక పూర్వం ఒక్క జాగ్రత్త మాత్రం తీసుకున్నాను. నా ఆస్తిలో సగం స్థిరాస్తి రూపంలో ఉండనిచ్చి మిగిలిన సగం నగదుగా మార్చాను. ఇష్టులైన స్నేహితులను అనేకమందిని చేరదీసి, తింటూ, తాగుతూ, విహా రాలు చేస్తూ నగదంతా కొద్దికాలం లోనే ఖర్చుచేశాను. డబ్బు అయిపో గానే నా ప్రాణమిత్రు లనుకున్న వారంతా అదృశ్యులైపోయారు. నాకై నేను వారిని వెతుకుతూ పోయినా వారి దర్శనం లభించింది కాదు.

"స్నేహం ఎలాటిదో నాకు బోధ పడింది. ఇక ఎన్నటికీ ఎరిగిన స్నేహి తులను చేరదీయనని శపథం పట్టాను. కాని స్నేహితంమీద మాత్రం మమ కారం పోలేదు. అందుచేత రోజూ ఈవిధంగా అపరిచితుల స్నేహం సంపా దించుకుంటూ ఉంటాను. ఎవరితో నైనా ఒక్క రోజే స్నేహం చేస్తాను. ఆ స్నేహం విషమించటానికి అవ కాశం ఇవ్వను.

"అందుచేత రేపు తెల్లవారగానే తమకు నేను వీడ్కోలు చెప్పేస్తాను. తిరిగి మనం కలుసుకున్నా నేను మీకేసి చూడను. ఇందుకు మీరేమీ అపోహపడవద్దు." (ఇంకా వుంది)





# వార్తలు-విశేషాలు

ద్వితీయ పంచవర్ష ప్రణాళికకింద, రాష్ట్రంలో చెరుకుపంట అభివృద్ధికిగాను, 36 లక్షల రూపాయల ఖర్చుకాగల, అయిదు పథకాలను ఆంధ్ర ప్రభుత్వం రూపొందించింది. ప్రస్తుతం ఆంధ్రలో దాదాపు 29.5 లక్షల టన్నుల చెరుకు ఉత్పత్తి అవుతున్నది.

*  *  *  *

సాంఘిక విజ్ఞానశాస్త్రంలోను, గ్రామసేవలోను శిక్షణ యిచ్చేందుకు, పరిశోధనలు సాగించటానికై, ప్రపంచ వైజ్ఞానిక సంస్థ, మనదేశంలో రెండు కేంద్రాలను నెలకొల్ప నున్నదని, ఆ సంస్థ అధ్యక్షులు డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియార్ ప్రకటించారు.

*  *  *  *

ప్రెసిడెంట్ డాక్టర్ రాజేంద్రప్రసాద్ 71వ జన్మదినోత్సవం, డిసెంబర్ 3వ తేదీన దేశమంతటా మహా వైభవంగా జరుపబడింది.

*  *  *  *

పరమాణుశక్తి ఉత్పత్తి, వినియోగాలలో పరస్పరసహకారంకోసం, బ్రిటన్, భారతదేశాల మధ్య ఒక ఒడంబడిక కుదిరింది. ఈ ఒడంబడిక కారణంగా బ్రిటన్, ట్రాంబే (బొంబాయి)లో నిర్మించబడుతున్న రియాక్టర్‌కు మేలిరకం యురేనియం ద్రవ్యాలను సరఫరా చేస్తుంది.

*  *  *  *

1955 జనవరినుంచి, అక్టోబరు వరకు 203 లక్షల రూపాయిలు నగదుగా, విదేశాలనుంచి పెట్టుబడిరూపంలో మనదేశానికి వచ్చినట్లు, ఆర్థికమంత్రి శ్రీ సి. డి. దేశముఖ్ రాజ్యసభలో వెల్లడించారు.



మనదేశంలో మోటారుసైకిళ్ల కర్మాగారం నిర్మించేందుకు జెకోస్లోవేకియాతో మన ప్రభుత్వం సంప్రతింపులు జరుపుతున్నది. ¼ అశ్వశక్తి గలిగి, చౌకగా లభ్యమయ్యే విధంగా ఈ మోటారుసైకిళ్ళు నిర్మింపబడగలవని, జెకోస్లోవేకియా ప్రభుత్వ ప్రతినిధి వెల్లడించాడు.

* * * *

ఆచార్య శ్రీ వినోబాభావే ఆంధ్రదేశపర్యటన చేస్తున్నారు. ఇంతవరకు శ్రీ భావే పర్యటించిన 5 ఆంధ్ర జిల్లాలలోను **41500** ఎకరాలు దానంగా లభించినవి. ఇందులో ఒక్క కృష్ణా జిల్లాలోనే **24** వేల ఎకరాలు దానంగా యివ్వబడినవి.

* * * *

ఆంధ్ర విశ్వవిద్యాలయానికి చెందిన భూగోళశాస్త్రజ్ఞుల దళంవారు, తూర్పు గోదావరిజిల్లా, రాజోలు తాలూకా, తాడిపాకలో ఎర్రబొగ్గు (లిగ్నయిట్) లభ్యంకాగలదని కనుగొన్నారు. పశ్చిమ గోదావరిజిల్లాలోని నరసాపూర్, పాలకొల్లువరకు ఈ ఎర్రబొగ్గు లభ్యంకాగలదని భావించ బడుతున్నది.

* * * *

ప్రెసిడెంట్ డాక్టర్ రాజేంద్రప్రసాద్ జనవరి **31** వ తేదీనుంచి తిరువాన్కూర్-కొచ్చిన్ యూనియన్‌లో పర్యటించి, తర్వాత లకదీవులనుకూడా సందర్శిస్తారు.

* * * *

వరదల నివారణకు సంబంధించిన విషయాలను సేకరించడానికిగాను, హిమాలయ ప్రాంతంలో **18** హైడ్రొమెటిరొలాజికల్ పరిశోధన కేంద్రాలను నెలకొల్పాలని భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నదని రాజ్యసభలో వెల్లడించబడింది.

* * * *

మనదేశం జపానుకు ముడిఇనుము మరింత ఎక్కువగా ఎగుమతిచేయటానికి వీలుగా, రవాణాసౌకర్యాల అభివృద్ధి పథకం ఒకటి ఆలోచింప బడుతోంది. ఇందుకుగాను విజయ నగరం, వాల్తేరులమధ్య రైల్వేలైనులు రెట్టింపుచేయటానికి, విశాఖపట్టణం హార్బరులో మరిరెండు బెర్తులు నిర్మించటానికి ఆలోచన జరుగుతున్నట్టు లోక్‌సభలో వెల్లడించబడింది.



# చిత్రకథ





ఒక ఆదివారంరోజున దాసూ, వాసూలు పులి ఆట ఆడదలిచారు. వాసు వాళ్ల యింట్లోవున్న పులిచర్మం ఒకటి తెచ్చాడు. అది మీద కప్పుకుని, ఇద్దరూ కాళ్లా చేతులమీద నడుస్తూ, పులిలా అరవసాగారు. కిటికీలోంచి, తొంగిచూచిన 'టైగర్' మొదట పులి అని భయపడింది. కాని, కాసేపటికి దానికి సంగతి అర్థమయింది. వెంటనే అది భీకరంగా అరుస్తూ మీదికొచ్చేసరికి, పులిచర్మంలో దాక్కుని వున్న దాసూ వాసూలు పులిని చూచినంత గాభరాపడి వెల్లకిలా పడిపోయారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

గుహలో కదలక పడుకుంటా!

పంపినవారు:
పి. రామకృష్ణారెడ్డి, గోపాలపురం

